# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

Tuesday, the 9th March 1954.

The House met in the Assembly Hall, Kurnool, at Eleven of the Clock, Mr. Speaker (The Hon. Sri N. Venkatramaiya) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS.

### SHORT NOTICE (STARRED) QUESTION.

*Second Language Test to Co-operative Sub-Registrars.*

* 247-A. Q.— Sri PILLALAMARRI VENKATESWARLU :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

Whether the Government propose to abolish the second language test to Co-operative Sub-Registrars (CSR) which is a bar to draw increment ?

The Hon. Sri D. SANJIVAYYA :— The Government are examining, as a general question, the continuance or otherwise of Language Test for the services. This question covers also the case of Sub-Registrars in the Co-operative Department.

Sri PILLALAMARRI VENKATESWARLU:-అధ్యక్షా, మనము composite Madras State లో వున్నప్పుడు ప్రాట్టిషన్న అయ్యేముందు Co-operative Registrar యీ Second Language Test ను ఎత్తివెయ్యాలని సూచన చేసినసంగతి నిజమేనా ?

THE HON. SRI D. SANJIVAYYA :— నాకు తెలియదండి.

SRI M. VEERABHADRAM:— 45 సం॥ల వయస్సువారికి వారిని, యీ టెస్టునుంచి మినహాయించారు అనే సంగతి నిజమేనా ?

THE HON. SRI D. SANJIVAYYA :—నాకు తెలియదండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఈ జి. వో. లో వలభై సంవత్సరాలు దాటిన వుద్యోగుల నందరిని నిర్బంధించిన సంగతి తెలుసునా ?

THE HON. SRI D. SANJIVAYYA :— తెలియదండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— మంత్రిగారు ఎప్పుడైనా "నాకు తెలియదండి" అనే సమాధానం ఇవ్వడము అంటే నాకు అర్థంకావడం లేదు. ఏదైనా ప్రశ్న వేసి నప్పుడు దానికి సమాధానం వివరాలతో చెబితే సరిపోతుంది. నా ప్రశ్నకు వివరంగా సమాధానం కావాలని కోరుతున్నాను.

THE HON. SRI D. SANJIVAYYA :— ఈ ప్రశ్నకు సమాధానం యింతకుముందే చెప్పాను. ఈ విషయం అన్ని డిపార్టుమెంట్లలో వున్న వుద్యోగస్థులకు కూడా సంబంధించినది కాబట్టి, దీనికి ప్రత్యేకంగా చెప్పలేను. ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత ఈ పరీక్షలో ఉత్తీర్ణులు కావలసిన అవసరమున్నదా లేదా, ఉన్నట్లయితే, ఏ ఏ డిపార్టుమెంటులలో, ఎంతమంది వున్నారనే విషయాలు అన్నియు సమగ్రంగా సేకరించవలసిన అవసరం వుంది. ఈ విషయంలో ప్రభుత్వం యింకా ఏ నిర్ణయానికి రాలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఇంకా ఎంతకాలంలో ప్రభుత్వం నిర్ణయానికి రాగలదు ?

THE HON. SRI D. SANJIVAYYA :—త్వరలోనే నిర్ణయానికి వస్తాము.

*Gazetted Officers in Andhra State.*

* 248 Q.—Sri C. V. K. RAO :— Will the Hon. the Chief Minister be pleased to state—

(*a*) whether the publication of a list of Gazetted Officers in Andhra State is ready ; and

(*b*) if not, when it will be ready ?

9th March 1954]

The Hon. Sri N. SANJIVA REDDI :— (a) and (b):- The list is being compiled. It is likely to be ready by April 1954.

*Deficit of Andhras in the Electricity Department.*

* 249 Q.—Sri K. KRISHNA RAO :—Will the Hon. the Deputy Chief Minister be pleased to State :

(a) Whether it is a fact that there is a paucity of Andhras in the number of employees in the technical departments of the Andhra and Rayalaseema Systems ; and

(b) if so, the steps the Government have taken to make up the deficit of Andhras in the technical departments of the Electricity Department?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) The matter is under consideration.

SRI K. GOVINDA RAO :— మన ఆంధ్ర రాష్ట్రములో Technical Departments కు అర్హతగలవారు తగినంతమంది లేరని మంత్రిగారు సమాధాన మిచ్చారు. మాచ్ ఖండ్ లో ఆంధ్రులు వుండగానే, ఆంధ్రేతర వుద్యోగస్థులను పిలిపించి, అక్కడ వున్నవారిని నిర్లక్ష్యము చేస్తూ, వెనుకబడవేయడం జరిగిందనే సంగతి నిజమేనా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—రాష్ట్రం విభజన రోజులలో ఆంధ్రేతరులయిన కొంతమంది వుద్యోగస్థులను మన ప్రభుత్వం P. W. D. శాఖలోకి తీసుకోవడం జరిగింది. మనకు సరియైనవారు దొరుకుతారు అనే ధైర్యం ప్రభుత్వానికి కలిగిన తరువాత, ఆంధ్రేతరులను పంపివేయటానికి అభ్యంతరము వుండదు. వారందరిని మన ప్రభుత్వంయొక్క అవసరాన్నిబట్టి తెచ్చుకున్నాము.

Sri P. PUNDARIKASKHACHARYULU:-Central Government Service లో ఆంధ్రులు ఎంతోమంది వున్నారని తెలుస్తున్నది? వారినందరిని పిలిపించటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

[ 9th March 1954

The Hon. Sri. N. SAJEEVA REDDI:— Central Government Service లో వున్న వారిని మనము తప్పకుండా రమ్మని ఆహ్వానిస్తునే వున్నాము.

Sri C. SUBBARAYUDU:—ఎంత తొందరలో యీ కొరతను, ఏవిధంగా పూర్తిచేయటానికి ఆలోచన చేస్తున్నారో తెలియజేస్తారా?

The Hon. Sri. N. SANJEEVA REDDI:— ఈ డిపార్టుమెంట్లలో కొద్దిమంది ఆంధ్రేతరులను మాత్రమే తీసుకున్నాము. అది కూడా యిప్పుడు జరగలేదు. వారిని క్రింది తరగతులనుంచే Assistant Engineers గా తీసుకున్నాము. వున్నవారిని promote చేస్తున్నాము. Executive Engineers ను, Superintending Engineers ను ఆయారాష్ట్రాలనుంచి తెప్పించాలని Chief Engineer చెప్పారు. వారు ఆప్రయత్నమే చేస్తున్నారు. ఆవిధంగా కొరత పూర్తిఅవుతుందని ప్రభుత్వంఅభిప్రాయపడుతున్నది.

* Sri VAVILALA GOPALAKRISHNAIAH- ఆంధ్రరాష్ట్రంవచ్చినతరువాత, ఎలాట్‌మెంటు చేసేముందు తుంగభద్ర ప్రాజెక్టులో పనిచేస్తూఉండే Engineers ను, సెలవులోవున్నవారిని రాజీనామాలు యివ్వాలని కోరడమయ్యిందని విన్నాను. వారిని సర్వీసులో continue చేశారా? వారివల్ల యితరులకు priority లేకపోతే పోయినప్పటికిని, వారితో సమానంగానైనా priority యివ్వటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— వారుచెప్పే information ఆ విధంగా వుంటే, I accept it with thanks.

Sri. G. YELLAMANDA REDDI:— Technical personnel మనప్రభుత్వానికి కొరతగా వున్నదని మంత్రిగారు చెబుతున్నారు. ఇంతవరకు కాలేజిల్లో పాసయిన వారందరికి ఉద్యోగాలు లభించాయని అర్థమా?

9th March 1954]

The Hon. Sri N. SANJEEVA REDDI :—మనకు కావలసినంతమంది Assistant Engineers, Supervisors వున్నారు. త్వరలోనే Superintending Engineer పదవి కావాలని అంటారు. మన ఆంధ్రులలో చాల మంది చక్కగా పనిచేస్తున్నవారు వున్నారు కాని మంచి అనుభవమువుంటేనేగాని ఆపై వుద్యోగాలకు వేయము. ఇప్పుడు పని నేర్చుకొన్నవారు, అందరు మంచి అనుభవం సంపాదించి బాగా తయారు అయితేనేగాని, ఆంధ్రేతరులను పంపించటానికి వీలుండదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :—మచ్ ఖండ్ ఏరియాలో గుమాస్తాల దగ్గరనుంచి మేస్త్రీలవరకు ఆంధ్రేతరులను, ముఖ్యంగా తమిళనాడు నుంచి తీసుకొని వచ్చిన విషయం మంత్రిగారికి తెలుసునా?

The Hon. Sri N. SANJEEVA REDDI:—చిన్న చిన్న ఉద్యోగస్థులలో అంటే tracers, గుమాస్తాలు ఉన్నారు. ఇంకను allotted వారు కూడా కొంతమంది వున్నమాట నిజమే. వారినుంచి జరిగేపని పూర్తి అయ్యేవరకు, వున్నవారిలో యిష్టమువచ్చినవారిని కొంతమందిని చేర్చుకోవడం అవసరంవుంటుంది.

Sri K. MALAKONDAYYA:—ఇప్పుడువున్న Engineers లో అరవలు మొత్తం ఎంతమంది ఉన్నారో చెబుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— నా వద్ద list వున్నది.

| | |
|---|---|
| I. Superintending Engineers | (1) Krishnamurthi<br>(2) Venkateswaran<br>(3) Krishaswami |
| II. Executive Engineers | (1) U. P. Naik<br>(2) Garudachari<br>(3) C.Tirunavukkarasu<br>(4) K. P. Bhat<br>(5) L.S.Vaidyanathan<br>(6) J. H. LeMerle |

III. Assistant Engineers; 4.

| | | | |
|---|---|---|---|
| IV. Draftsman | Ist | Grade | 7 |
| | II | Grade | 3 |
| | III | Grade | 1 |

V. Tracers 9

Sri. S. VEMAIAH:— అధ్యక్షా, ఆంధ్రులు కొరతగా వున్నారని మంత్రిగారు చెబుతున్నారు. ఏ category లో కొరతగా వున్నారో తెలుపుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:—ఇప్పుడు categorical గా కొరతగావున్నవారి పేర్లను చెప్పాను, అదంతా కొరత అన్నమాటే.

Sri P. PUNDARIKAKSHACHARYULU:—ఇతర ప్రభుత్వాలనుంచి యిక్కడికి రావడానికి, యిక్కడ జీతాలు ఎక్కువగా యిస్తారనే కారణమేమైనా యిక్కడ వస్తున్నదా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— అదికూడా ఉంటే ఉండవచ్చు. ఇక్కడ రాష్ట్రములో కొరత వుండబట్టి, మనం ఎక్కువ salaries యిస్తేనేగాని రారు. అయితే యిప్పుడున్న ఆంధ్రులకు అపకారము చేసినట్లుకూడ అవుతుంది.

అయిదువందలు జీతము ఒక ఉద్యోగానికిగాను యిక్కడ యిస్తున్నప్పుడు, బైటవారికి 8 వందలు యిస్తే, యిక్కడి వారికి బాధకలుగుతుంది. అందుచేత వారికి మనకు సరిపోయేటట్లుగా ఏదైనా ఒక agreement తీసుకోవలసి వుంటుంది.

SRI T. POTHA RAJU:—అనుభవము వున్నవారిని promote చేయకూడదా?

THE Hon. SRI N. SANJEEVA REDDI:- తప్పకుండా చేయవచ్చు. కాని అనుభవం వున్నవారు అంటే మన దృష్టిలో కాదు.

చీఫ్ యింజనీరు దృష్టిలో చూడాలి. నాలుగు, అయిదు సంవత్సరాలు Assistant Engineer గా వుండి వెంటనే Executive Engineer గా గాని Superintending Engineer గా కావాలని ప్రతివాడికి వుంటుంది. కొంతమంది అనుభవమున్నా లేకపోయినా, రెండేళ్ళు సర్వీసుచేసి, వెంటనే Superintending Engineer యివ్వమంటే, అది సాధ్యపడదు. Chief Engineer కూడా సరియైన అనుభవము, తగినంత సర్వీసు వుంటేనేగాని, కావటానికి సావకాశాలుండవు.

*Survey and Settlement in the Zamindari Estates.*

* 250 Q.—Sri G. YELLAMANDA REDDI:— will the Hon. the Minister for Land Revenue be pleased to state :

(*a*) Whether the Government propose to complete in the current year the survey and settlements in the Zamindari Estates taken over by Government in 1949 ; and

(*b*) if not, why ?

The Hon. Sri K. KOTI REDDI :—

(a) & (b) : A statement showing the progress of Survey and Settlement operations as on 30-11-53 in the Estates taken over in 1949 in given below.

| | | Sq. Miles. |
|---|---|---|
| 1. | Total area of estates taken over in 1949 ; | 4672·03 |
| 2. | Total area out of item No. 1, in which Survey has been completed | 2506·79 |
| 3. | Out of the area of item No. 2, the area for which records have been supplied to the Settlement Department. | 1578·18 |
| 4. | Out of the area shown in item No. 3, the area in which Settlement work has been completed. | 1264·69 |

It will not be possible to complete in the current year the Survey and Settlement of the Estates taken over in 1949, for while on the one hand the area to be covered is very extensive, on the other, the scope for expansion of the survey operations is limited due to the dearth of experienced personnel. The Government propose however to make every endeavour to speed up Survey and Settlement operations to the extent possible.

Sri K. RAJAGOPALA RAO :— ఇప్పుడు ప్రశ్నలకు యిచ్చే జవాబులు, informative గా వుండి, పొడుగుగా వుంటే, అటు వంటి జవాబులను table మీద పెట్టిస్తే, కొంచెము సౌకర్యముగా వుంటుంది. అలాగే figures యేమైనా వుంటే కూడ వ్రాతపూర్వక ముగా యిప్పించడం మంచిది. కాబట్టి, ఆ విధంగా యేర్పాటు చేస్తారా?

The Hon. Sri K. KOTI REDDI :— ఆలోచిస్తాము.

*Cut in V. G. Os', House Rent.*

* 251 Q.—Sri S. VEMAIAH :— Will the Hon. the Minister for Finance and Law be pleased to state whether it is a fact that Rs. 2/- was cut out of the Non-Gazetted Officers' house rent ?

The Hon. Sri T. VISWANATHAM :— No, Sir. ఆలాగున ఏమీ తగ్గించలేదండి.

*Non-implementation of the G. O. Ms. No. 1593, Health D. 28th April 1953.*

* 252 Q.—Sri M. VEERABHADRAM :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state -

(a) the names of medical institutions in the State that have not implemented the G.O. Ms. No. 1593, Health dated 28th April 1953 ; and

(b) the reasons for their non-implementation ?

9 th March 1954 ]

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) The following institutions have not yet implemented the orders issued in G. O. Ms. No. 1593 Health. dated 28th April, 1953 :—

| NAME OF THE INSTITUTION. | | DISTRICT. |
|---|---|---|
| Government | Dispensary, Chintapalli. | Visakhapatnam and Srikakulam. |
| -do- | Hospital, Anakapalli. | -do- |
| -do- | Dispensary, Seethampeta. | -do- |
| -do- | -do- Araku. | -do- |
| -do- | -do- Somepeta. | -do- |
| -do- | Dispensary, Krishnadevipeta. | -do- |
| -do- | Hospital. Araku Valley. | -do- |
| -do- | -do- Narasepatnam. | -do- |
| -do- | Maharani Hospital, Vizianagaram. | -do- |
| -do- | Hospital, Tekkali. | -do- |
| -do- | Hospital. Srikakulam. | -do- |
| -do- | Police Hospital, Vizianagaram. | -do- |
| -do- | Headquarters Hospital, Masulipatam. | Krishna |
| -do- | Hospital, Vijayawada. | -do- |
| -do- | -do- Gudivada. | -do- |
| -do- | -do- Nuzvid. | -do- |
| -do- | -do- Munagala. | -do- |

(b) The delay in implementing the orders sdiue to the following reasons :

(1) The Director of Medical Services has to collect necessary particulars in the matter of obtaining sanction of Government for relaxing age rule in respect of over-aged personnel.

(2) He has to collect similar particulars in regard to pay drawn in order to refix pay at the appropriate points in the scales to be given to the personnel.

SRI M. VEERABHADRAM :— ఈ G. O. ను బందరు హాస్పిటలులోను, తదితర ముఖ్యమైన హాస్పిటల్సులోను అమలు జరుప

లేదని మంత్రిగారు చెప్పారు. అసలు ప్రభుత్వము యిచ్చిన scalse ప్రకారము యిప్పుడు జీతాలు యిస్తున్నారు కదా. ఈ G. O. ను అమలు పర్చుటలో జరిగిన ఆలస్యమునకు కారణం యేమిటో తెలియ జేస్తారా? వెంటనే ఆ G. O. ను అమలుపర్చడానికి (ఆ తారీఖునుండే) కృషిచేస్తారా?

THE HON SRI D. SANJIVAYYA:— అమలు జరుప డానికి తప్పకుండా కృషిచేస్తాము. కాని నేను చెప్పిన కారణాలుగా age exemption, pay refixation మొదలైన అన్ని విషయాలను సమగ్రంగా ఆలోచించవలసి ఉన్నది కాబట్టి, కొంత ఆలస్యం జరిగిన మాట వాస్తవము.

SRI K. GOVINDA RAO:—ఇందాకా ఏ ఏ Hospitalsలో యీ G. O. implement కాలేదో వాటి పేర్లను మంత్రిగారు చెప్పారు. కాని, ఆ G. O. ను implement చేసిన hospitals యేవో చెపుతారా?

THE HON. SRI D. SANJIVAYYA:—ఇవి కాకుండా తక్కిన hospitals అన్నింటిలోను implement అయినవని అర్థం.

SRI PILLALAMARRI VENKATESWARLU:— ఈ order 1948-వ సంవత్సరములో pass అయింది కదా. దానిని చదివితే, అందులో "This recommendation was accepted in the case of hospital workers and given effect to in 1948" అని వున్నది. Cabinet Sub-Committee వారు ఉద్యోగుల జీతముల గురించి 1947-వ సంవత్సరంలో సిఫార్సులు చేస్తే ఆ recommendations 1948-వ సంవత్సరంలో accept చేసి, implement చేయాలని వుంది. కాని, యింతవరకు అంటే, ఆరు సంవత్సరముల వరకు ఆలస్యం జరుగుతే, ప్రభుత్వం యేమైనా చర్యలు తీసుకుండా? ఇంతవరకు అమలు జరుపకుండా వుండటంలో వుండే ఉద్దేశం యేమిటో తెలియజేస్తారా?

[9th March 1954

గారు చెప్పుతున్నారు. ఈ recommendations ను హృదయ పూర్వకముగా అంగీకరిస్తున్నారా? Anomaly అని అనుకోక అంగీకరిస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA:—ఈ recommendations ను హృదయపూర్వకముగా అంగీకరించకపోయి యున్నట్లయితే, మిగతా hospitals విషయంలో యీ order ను implement చేశాము. ఈ order లో యీ వాక్యము యిక్కడ వున్నది. "In April, 1953, the Government accepted the recommendations passed in G. O. No. 1593, Health, dated 28-4-53," అని వున్నది. శ్రీ వెంకటేశ్వర్లుగారు యింకొక order ఏదో తీసుకువచ్చి, అందులోని విషయాలు చెప్తున్నారు. కాబట్టి ఆ order copy నాకు యిస్తే, దానిని పరిశీలించి దీనికి సంబంధించిన అన్ని విషయాలకు సమాధానము యిస్తాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :— మంత్రిగారి office లో వుండే records లో యీ G. O. copy లేకపోతే, యీ copy ని మీద్వారా వారికి అందజేస్తున్నాను.

Mr. SPEAKER :— I think it is not an authenticated copy. అది authenticated కాపీ కాదు కాబట్టి.... (interruption.)

Sri PILLALAMARRI VENKATESWARLU :—We will take the responsibility for the correctness of the copy.

*Students studying outside India.*

*253 Q.—SRI T. LAKSHMINARAYANA REDDY:- Will the Hon. the Minister for Education and Industries be pleased to state:

(a) the number of students of this province who are studying outside India;

(b) the number of students that are given Government help; and

9th March 1954]

(c) whether there are students of this province studying in Russia, China, Germany, Poland and England?

The Hon. Sri. S. B. P. PATTABHIRAMA RAO:—(a) (b) and (c), Government have no information regarding the number of private students of this State studying abroad. But one Andhra Officer is at present undergoing advanced studies in the United Kingdom with Government help.

SRI K. RAJAGOPALA RAO :—అలాంటి information తెప్పించి ఇతరదేశాల్లో చదువుకుంటున్న ఎంతమందికి గవర్నమెంటు help కావలసివస్తుందో పరిశీలిస్తారా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :—ఆంధ్రదేశం అంతా పరిశీలించాలి. దానికి చాలా కాలంపడుతుంది. ప్రైవేటుగా వెళ్లినవారి సంగతి నాకు తెలియదు కాని, గవర్నమెంటు ద్వారా వెళ్లినవారు మాత్రం ఒక్కరు. ప్రైవేటుగా వెళ్లిన వారి విషయం తెలుసుకోడానికి కొంత కాలం పడుతుంది. ఆ వివరాలు మాదగ్గర లేవు.

*Sri P. RANGA REDDI :—ఒక ఆంధ్రా ఆఫీసరు చదువుతున్నారని చెప్పారు. ఆయిన పేరు చెప్తారా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—Sri K. Umamaheswara Rao Assistant Lecturer of Mathematics, formerly in Government College of Technology, Coimbatore has been selected and sent abroad on the Government of India overseas scholarship.

* Sri VAVILALA GOPALAKRISHNAIAH :—ఇతర దేశాలకు వెళ్లిన విద్యార్థులకు కావలసిన సౌకర్యాలు కల్పించడానికి ప్రత్యేకంగా ఒక బీరువా ఉంది. ఆవిధంగా వాళ్లకు కావలసిన సౌక

ర్యాలు ఆయా ప్రభుత్వాలే చేస్తున్నాయి. ఇక్కడ కూడా అటువంటివి లేదా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— ఇక్కడ ఇంకా అటువంటి బిరుదాలు తెరవలేదు.

* Sri VAVILALA GOPALAKRISHNAIAH :— ఆ బిరుదాలు ఎప్పుడు తెరుస్తారు ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— అసలు బిరుదా అంటే ఖజానా బిరుదా అనా లేక ఇంకేదైనా బిరుదానా? నాకర్థంకాలేదండి.

*Representations from the public of Venkatagiri Town.*

*254 Q.—Sri K. SHANMUGAM :—Will the Hon. the Chief Minister be pleased to state-

(a) whether any representations have been made by the public of Venkatagiri Town, Nellore District, to the Government requesting that either all or some of the State Offices which are at present retained at Madras may be located at Venkatagiri in view of a number of palatial buildings being readily available for accommodating the offices along with a large number of residential quarters for housing the officials as well as the clerical staff of the offices ; and

(b) if, so, the action taken thereon ?

The Hon. Sri T. PRAKASAM.

*Clause* (a) :—The answer is in the affirmative.

*Clause* (b) :—The representation was considered. The general question of shifting the Andhra Government offices now in Madras is under the consideration of the Government, and no decision has been taken in the matter.

(ఎ) అవును.

(బి) చేసినటువంటి రిప్రజంటేషన్ ఆలోచించబడ్డది. కాని, అసలు ఆంధ్రా గవర్నమెంట్ ఆఫీసులు అన్నికూడా మద్రాసునుంచి మరొక చోటుకి మార్చవలెననే సంగతి యోచనచేయబడుతున్నది. దానికి సరిగా ఏర్పాట్లుకాలేదు. ఏర్పాట్లు కాగానే మీకందరకూ చెబుతాం.

SRI T. POTHA RAJU:— గత సమావేశంలో బెజవాడ గుంటూరు ప్రాంతంలో ఆఫీసులు పెట్టడానికి ఒక amendment వచ్చింది వెంటనే వాటిని అక్కడకు తరలించడానికి గవర్నమెంట్ ఏమైనా ఆలోచిస్తుందా ?

THE HON. SRI T. PRAKASAM:—అనేక మోస్తరులుగా ప్రశ్నలు వేస్తున్నారు. వారికి వారే జవాబులు చెప్పుకుంటున్నారు. గవర్నమెంటుకు సంబంధించినంతవరకు తీవ్రమైన ఆలోచనలోవుంది. అందుచేత ఏవిషయమైనకూడా మీకు సమాధానం చెప్పడానికి వీలులేక పోతున్నది.

*Opening of a new ward in Atmakur Town Hospital.*

* 255 Q.—Sri G. C. KONDIAH:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state .when the new ward built recently in Atmakur Town Hospital will be opened ?

The Hon. Sri D. SANJIVAYYA:—The newly built maternity ward in the hospital has been handed over to the Medical Department on 2nd September 1953 and from that time onwards maternity cases are being admitted into the ward,

SRI G.C. KONDAYYA:—ఇంతవరకు ఏమీ admit చేసుకోవడంలేదు. ఒక company కి ఫర్నిచరు సప్లయి చేయడానికి ఆర్డరు ఇచ్చారు. ఫర్నిచరు లేనికారణం చేత admit చేసుకోవడంలేదు. దాని విషయంలో ఏమైనా చర్య తీసుకుంటారా ?

THE HON. SRI. D. SANJIVAYYA:—నాకు information వచ్చినంతవరకు, అక్కడ admit చేస్తున్నారని తెలిసింది. మీరు

furniture లేనందువల్ల admit చేసుకోవడం లేదని చెప్పారు. ఆలా జరిగినట్లయితే తప్పకుండా చర్యతీసుకుంటాం.

SRI S. VENKATA RAO:—ఇప్పటికి ఎన్ని కేసులు admit చేసుకున్నారో మంత్రిగారు జవాబుచెప్తారా ?

THE Hon. SRI D. SANJIVAYYA :—దానికి ప్రత్యేక ప్రశ్నవేస్తే జవాబు చెప్తాను.

*Retrenchment of teachers in District Board Schools.*

*256 Q.—Sri S. KASIREDDY:—Will the Hon. the Minister for Education and Industries be pleased to state—

(a) whether it is a fact that the Government had sent orders to all the teachers of Board Elementary Schools asking them to inform the villagers to provide free accommodation for schools, and if the accommodation is not available the schools would be closed;

(b) whether there is retrenchment of teachers in Elementary and High Schools of District Boards, and

(c) If so, the reasons for such action?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :—

(a) The answer is in the negative.

(b) No retrenchment was effected in Elementary Schools under District Boards. Some teachers in High Schools have been retrenched in Nellore, Guntur and Chittoor District Boards.

(c) In view of the financial stringency, in other cases, on account of inadequate strength in schools, retrenchment had to be effected.

SRI G. YELLAMANDA REDDI:—నెల్లూరు జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరు పర్సనలు అసిస్టెంటు, స్కూలు బిల్డింగు గ్రామస్తులు వుచితంగా యివ్వకపోతే స్కూల్సు ఎత్తివేయవలసి వస్తుందని ఒకసర్క్యులరు జారీచేశారు. ఈ విషయము మంత్రిగారికి తెలియదా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:- ఏమని పంపించారని వారి అభిప్రాయం.

Sri G. YELLAMANDA REDDI:— ఏ గ్రామంలో అయినా సరే ఆ గ్రామస్తులు ధనసహాయం చేయక పోతే స్కూలు ఎత్తివేయమని.

The Hon. Sri. S. B. P. PATTABHIRAMA RAO:— అట్లా పంపించలేదు. కొన్ని గ్రామాల్లో స్కూలుకు బిల్డింగ్సు లేనప్పుడు ఇంకో విధంగా ఏర్పాటు చేయవలసి వచ్చింది. మేము స్కూళ్ళు తీసేస్తాం అని చెప్పలేదు. స్వార్థరహితులైన ఉదారులెవరైనా బిల్డింగ్సు కట్టుకోడానికి ధనసహాయం చేస్తే చేయమన్నాం. అలా చేయడంవల్ల అద్దెలేకుండా ఇళ్లు వచ్చాయి. అంతేకాని అసలు మేము స్కూలుపెట్టము అని చెప్పలేదు. దానివలన ఆరు చోట్ల స్కూళ్ళు ఇచ్చారు.

*Panduva Gandi Scheme in Kanigiri Taluq.*

* 257 Q.—Sri G. YELLAMANDA REDDI :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Panduva Gandi scheme in Kanigiri Taluk, Nellore District, was sanctioned ; and

(b) if so, whether and when its execution be taken up?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

(a) The answer is in the negative,

(b) The scheme has been recommended to the Planning Commission.

*Abolition of Inams.*

*258. Q.—Sri K. GOVINDA RAO:—Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) whether the Government are considering the proposal to take up the abolition of inams ; and

(b) if so, when?

The Hon. Sri K. KOTI REDDI :—clauses (a) and (b): As the hon. Member is aware, the Madras

[9th March 1954

Estates Abolition Act, 1948, applies to all inam estates as defined under Section 3, Clause (2) (*d*) of the Estates Land Act, other than inams which became estates by virtue of the Madras Estates Land (Third Amendment) Act, 1936. The question of extension of the Abolition Act to other classes of inam estates will be considered as soon as the financial position of the State Government permits.

SRI K. GOVINDA RAO:—Financial position బాగుపడిన తరువాత దీన్ని accept చేస్తాం అనిచెప్పారు. దానిఅర్థం ఏమిటండి?

THE HON. SRI K. KOTI REDDI:—ఈ inam estates ను తీసుకుంటే compensation ఇవ్వవలసి ఉంటుంది. తరవాత ఈ abolition acts కు సంబంధంలేనివి కొన్ని ఉన్నాయి. ఈ రెండూ కూడా ప్రొప్రైటర్ను చేతుల్లో ఉంటాయి ఏకో రెండుమూడు తప్ప మిగతావి తీస్కున్నాము. ఈ రెంటివిషయంలో. High Court Stay Orders ఉండడంవల్ల తీస్కో లేదు. Compensation ఇస్తేగాని ఇదంతా సాధ్యంకాదు. ప్రస్తుతం మన ఆర్థికపరిస్థితులను బట్టి అన్ని ఎస్టేట్సు తీస్కోడానికి వీలు లేదని చెప్పారు. మన ఆర్థిక పరిస్థితి బాగుపడితే అంతా చేయవచ్చు.

SRI VAVILALA GOPALAKRISHNAIAH:—Governmant, compensation ఇవ్వడానికి డబ్బులేక ఊరుకున్నదా, లేక legal points అడ్డంవచ్చాయా?

THE HON. SRI K. KOTI REDDI:—Legal points అడ్డు వచ్చికాదు.

SRI P. PUNDARIKAKSHACHARYULU:—ఇతర ఈనామ్ ఎస్టేట్లు రద్దుచెయ్యడం విషయంలో ప్రభుత్వ ఆర్థికపరిస్థితులు బాగావుంటే చేస్తామన్నారు. ఈలోపుగా రైతుల రక్షణకు interim legislation చెయ్యడానికి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తోందా?

THE HON. SRI K. KOTI REDDI:—ప్రభుత్వం సలహా ప్రకారం యీనాములన్నీ Rent Reduction Act క్రిందకు వస్తాయి. Rent Reduction Act క్రింద rents తగ్గించారు. అందువల్ల ఇనాము ఎస్టేట్లు రద్దయినా కాకపోయినా రైతులకేమీ యిబ్బందులుండవు financial position అభివృద్ధిచెందితేగాని వీటిని రద్దు చేయడానికి వీలుండదు.

SRI K. GOVINDA RAO:—చట్టంలో కొన్ని సెక్షన్లు amplify చేసి రైతులకు సహాయం చేసేందుకు కొరకు ప్రత్యేకమైన చట్టాన్ని తీసుకురాబోతున్నామని క్రిందటి బడ్జెటు ఉపన్యాసంలో గౌ. విశ్వనాథంగారు చెప్పారు. కాని మీరు చట్టం అవసరంలేదని, ప్రభుత్వం వారి ఆర్థిక పరిస్థితులు చక్కబడగానే దీనిని తీసుకుంటామని చెప్పారు. ఇందులో ఏది నమ్మాలో తెలియడం లేదు. ఇందులో ఎవరు చెప్పిన విషయం సరైనదో చెపుతారా ?

THE HON. SRI K. KOTI REDDI:—మీరు వేసిన ప్రశ్నకు నేను సరైన సమాధానమే చెప్పాను. కొన్ని ఇనాములు Estates Abolition Act క్రిందకు, మరికొన్ని ఇనాములు Rent Reduction Act క్రిందకు వస్తాయి. వీటిలో కొన్ని రద్దు చెయ్యబడ్డాయి. మిగతావి డబ్బువున్నప్పుడు రద్దుచేస్తాము.

SRI K. GOVINDA RAO:—నేను ప్రస్తుతం అమలు జరుగుతున్న 1936 సం॥ పు Rent Reduction Act ను గురించి చెపుతున్నాను. Inams ను రద్దుచేయడానికి యింకా కొంత time కావాలి అంటున్నారు. కాని ఈలోగా రైతుల రక్షణకు ఒకబిల్లును తీసుకొస్తామని శ్రీ విశ్వనాథం చెప్పారు. ఇదెంత వరకు నిజమో చెపుతారా ?

THE HON. SRI K. KOTI REDDI:— ఇవికూడా 1936 సం॥ పు Inams Abolition Act క్రిందికే వస్తాయి. 62, 63 కేసులుతప్ప మిగతావన్నీ ఇదివరకే తీసుకున్నాము. ఈ 62, 63 విషయంలో హైకోర్టులో stay orders వున్నాయి. కాబట్టి వాటిని ఇప్పుడు తీసుకొనేందుకు సాధ్యపడలేదు.

[9th March 1954

SRI K. GOVINDA RAO:— ఇది చాలా ముఖ్యమైన సమస్య. దీనిని వెంటనే పరిష్కరించక పోతే చాలా తీవ్రమైన పరిణామములు కలుగుతాయి. ప్రభుత్వంయొక్క ఆర్థిక పరిస్థితులు చక్కబడితేనేగాని వాటిని తీసుకోవడానికి వీలులేదని చెప్పారు. కాని అక్కడ రైతులను జమీందార్లు భూములనుంచి వెళ్ళగొట్టి నానాహింసలు పెడుతున్నారు. కోర్టులలో దావాలు, డిక్రీలు, కేసులు ఎన్నో గొడవలు జరుగుతున్నాయి. కాబట్టి వాటి విషయమై వెంటనే stay orders యిప్పిస్తారా?

Mr. SPEAKER—As the hon. Minister has already answered sufficiently, I cannot allow this question.

*L. F. Dispensary at Uravakonda.*

* 259 Q:— SRI S. NARAYANAPPA: Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state—

(a) whether there is a proposal to convert the Local Fund Dispensary at Uravakonda into a Government Hospital: and

(b) if so, when the proposal would be given effect to?

The Hon. Sri D. SANJIVAYYA:—

(a) The answer is in the affirmative.

(b) The scheme is under examination and will be considered in connection with the budget for 1955-56.

SRI C. SUBBARAYUDU:— ఈ లోకల్ ఫండు డిస్పెన్సరీలలో మందులులేక డాక్టర్లు పని చెయ్యలేకుండా వున్నారు. కాబట్టి సదరు డిస్పెన్సరీలకు చాలినన్ని మందులు సప్లయిచేయిస్తారా? యాడకి గ్రామం లోని హాస్పిటలులో మందులులేవని డాక్టర్లు చెప్పడం, రోగులు బాధపడడం జరుగుతోంది.

THE Hon. SRI D. SANJIVAYYA:— అన్ని హాస్పిటల్సు లోను మందులులేవని జనరల్ కంప్లయింటు చేసేదానికన్నా ఫలానా

9th March 1954]

హాస్పిటల్‌లో మందులు లేవంటే దాని విషయమై ఆలోచిస్తాము. మీరు చెప్పిన యాడికిని గురించి తప్పక చర్యతీసుకుంటాము.

SRI K. MALAKONDAYYA:— మాజిల్లానుంచి, ఇంకా ఇతర జిల్లాలనుంచికూడ కొన్ని కంప్లెయింట్లు మీ దగ్గరకువచ్చినట్లు తెలుస్తున్నది. వాటిని గురించి మీరేమైనా చర్యతీసుకున్నారా?

THE HON. SRI D. SANJIVAYYA:—I do not know how this question is relevant. It relates to provincialisation of Uravakonda hospital.

SRI K. RAJAGOPALA RAO:— మా పామర్రు ఆస్పత్రికి సంవత్సరానికి సుమారు 7 వేలు ఖర్చవుతుంటే, రు. 700 లు మాత్రమే మందులకని శాంక్షన్ చేస్తున్నారు. ఈడబ్బుతో కొన్నమందులు బొత్తుగా చాలడంలేదు. దానివల్ల రోగులకు ఏమీ ఉపకారం జరగడంలేదు. కాబట్టి రోగుల సంఖ్యనుబట్టి అవసరాన్నిబట్టి మందులకు డబ్బు శాంక్షను చేయిస్తారా?

THE HON. SRI D. SANIVJAYYA:— తప్పకుండా ఆలోచిస్తాము.

SRI G. C. KONDAYYA:— మాజిల్లాలోని తాలూకా head-quarters లోవున్న హాస్పిటల్సుగురించిఅనుభవాన్నిబట్టి చెపుతున్నాను. ఒక్కొక్క ఆస్పత్రికి రు. 1500 యిస్తున్నారు. ఆ డబ్బు జూన్, జూలై నెలలవరకు సరిపోతుంది. ఆ తర్వాత రంగునీళ్ళతో ఆస్పత్రులు నడుస్తూ వుంటాయి. కాబట్టి వాళ్ళకిచ్చే శాంక్షను ఎక్కువచేసి సంవత్సరం పొడుగునా రోగులకు మందులిచ్చే యేర్పాట్లు చేస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA:— ప్రభుత్వ ఆర్థిక పరిస్థితులు దృష్టిలో పెట్టుకుని ఎంతవరకు సహాయం చెయ్యడానికి వీలుంటుందో అంతవరకు చేస్తాము.

SRI M. VEERABHADRAM:— ఉరవకొండ ఆస్పత్రిని ప్రభుత్వం తీసుకునేందుకు ఎంతడబ్బు వలసివస్తుందండి?

The Hon. Sri D. SANJIVAYYA:—I cannot give the answer. I will give the information later on.

[9th March 1954

SRI M. VEERABHADRAM :— ఎంతడబ్బు ఖర్చవుతుందో తెలుసుకోకుండా ప్రభుత్వం ఏవిధంగా దీనిని తీసుకుంటుందో తెలియడం లేదు. దయచేసి మంత్రిగారు కొంచెం తెలవిస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA:–మేము Director of Medical Services ను అడిగాము. ఆయన అనంతపురం జిల్లా మెడికల్ ఆఫీసరును అడిగారు. ఆయన తన proposals ను పంపించగానే తెలియ జేస్తాను.

SRI K. RAJAGOPALA RAO:— మేము information అడిగినప్పుడు నోటీసు కావాలని చెప్పడం, information లేదని చెప్పడం ఆలోచిస్తామనడం మంత్రులకు అలవాటయిపోయింది. కాస్తో కూస్తో సమాధానం యివ్వడానికి అలవాటున్న గౌ.|సంజీవయ్యగారు కూడా, "ఆలోచిస్తాము" అంటే సభ్యులకు చాలా అసౌకర్యం కలుగు తోంది. ఈ విషయమై మంత్రులకు తగు హెచ్చరిక చేసి, ఇకనైనా పూర్తి సమాధానాలు మాకు అందజేయిస్తారా?

No reply.

SRI VAVILALA GOPALAKRISHNAIAH :— అయ్యా రోజుకు 300 మంది out-patients, 30 మంది in-patients వున్న మా సత్తెనపల్లి ఆస్పత్రికి సంవత్సరానికి రు. 1400 లో. న మందుల నిమిత్తం యిస్తున్నారు. ఇది సరిపోదని ప్రభుత్వంకూడా అను కుంటోంది. కాబట్టి దీనిని రాష్ట్రప్రభుత్వ అజమాయిషీక్రిందకు తీసుకుంటారా ?

THE HON. SRI D. SANJIVAYYA :— ఒక్కొక్క ఆస్పత్రి విషయం తీసుకుని ఈ ఉరవకొండ ఆస్పత్రి సందర్భంలోనే చెపితే సమాధానం చెప్పడం కష్టం. వారు ప్రత్యేకంగా ప్రశ్న వేయవచ్చు. లేదా నాకు ఉత్తరంవ్రాస్తే సమాధానం చెప్పడానికి సావకాశం వుంటుంది. అంతేగాకుండా ఒక్కొక్క ఆస్పత్రికి సంవత్సరానికి ఎంతెంతడబ్బు సరిపో తుందని Director of Medical Services ను అడిగిచేస్తూ వుంటాము.

ఏదైనా ప్రత్యేకంగా ఒక ఆస్పత్రికి ఎక్కువడబ్బు కావాలంటే తప్ప కుండా ఆలోచిస్తాము.

Mr. SPEAKER :— It is not at all a question. It is only an impression of the hon. Member.

THE HON. SRI D. SANJIVAYYA:—అసలు questionకు దీనికి ఏమీ సంబంధము లేదు.

SRI M. VEERABHADRAM:—ఈ Uravakonda Local Fund Hospital ను Government Hospital గా చేయడం విషయమై 1955-56 బడ్జెటు అంచనాలు వేయు సందర్భంలో ఆలోచిస్తామన్నారు. అలా ఏ ప్రాతిపదిక క్రింద దీని విషయమై ఆలోచిస్తామని చెప్పారండి ?

THE HON. SRI D. SANJIVAYYA :— ఆ విధంగా ప్రాతిపదికలపైన ఆలోచనలు చేస్తున్నాము. ఆ ఆలోచనలలోనే ప్రాతిపదిక కూడా include అయివుంది.

SRI N. SIVARAMI REDDI :— ఈ Local Fund Hospitals లో కొన్ని మందులను ఉచితంగా ఇస్తున్నట్లు, కొన్ని మందులకు charge తీసుకుంటున్నట్లు ప్రభుత్వానికి తెలుసా ?

THE HON. SRI D. SANJIVAYYA:— అది నాకు తెలీదండీ. ఆవిధంగా జరుగుతుంటే దానినిగురించి విచారిస్తాను.

*Lingamma Kunta Tank of Nagampalli* :

* 260 Q.— Sri S. KASIREDDY :— Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) whether the Government estimated the cost of repairs and extension of Lingamma Kunta tank of Nagampalli of Podili Taluk, Nellore District ;

(b) if so, what the estimated amount is ; and

(c) how far the tank was repaired ?

[ 9th March 1954

THE HON. SRI K. KOTI REDDI :—

(a) Yes.

(b) Rs. 47,930-0-0.

(c) The work has not yet been sanctioned.

SRI S. KASI REDDY:— అధ్యక్షా! ఈ చెరువు మరమ్మత్తు మొదట sanction అయినది. అయిన తరువాత 2 వేల రూపాయలు ఖర్చుచేసి, కొంతవరకు పనిచేశారు. తరువాత contractors వచ్చి డబ్బుయిమ్మని అడిగితే, మీరు tenders పంపుకోండి అని పని ఆపివేయడం జరిగింది. ఈ చెరువు వ్యక్తిపరమైనది. దానిని స్వాధీనం చేసుకొనేటపుడు owners కు నష్టపరిహారం యివ్వలేదు. వారు ఒక statement ను పంపడంకూడా జరిగింది. వారికి ఇంతవరకు నష్టపరిహారం యివ్వలేదు. పని మొదలుపెట్టి 2 వేల రూపాయల పనిచేసి ఆపివేయడం జరిగింది. Sanction అయిన తరువాతనే 2 వేల రూపాయలను ఖర్చుచేసి పనిచేయడం జరిగింది. ఆ పనిని sanction చేశారు. కాబట్టి ఈ పనిని మొదలుపెట్టుటకు ప్రభుత్వంవారు ప్రయత్నిస్తారా?

THE HON. SRI K. KOTI REDDI :— Information నాకు సరిగా రాలేదు. అయినా దీని విషయమై information తెప్పించి విచారిస్తాను. ఇందులో వ్యక్తిపరమైన చెరువు అంటె నాకు అర్థంకాలేదు.

SRI P. PUNDARIKAKSHACHARYULU :— ఈ చెరువుకు ఎంతకాలం క్రిందట మరమ్మత్తు చేయడం జరిగిందండి?

THE HON. SRI K. KOTI REDDI :— Information లేదండి. Notice ఇస్తే information తెప్పించి చెప్తాను.

* SRI S. VEMIAH:— అయ్యా! ఈ చెరువు ఏ class క్రింద register అయివున్నది? దీనిక్రింద ఆయకట్టు ఎంత?

THE HON. SRI K. KOTI REDDI :— Information లేదండి. Information తెప్పించి చెపాను.

9 th March 1954 ]

SRI G. C. KONDAYYA :— వ్యక్తిపరమైన tanks అంటే, private tanks. ప్రభుత్వం ఈ private tanks కు repairs విషయంలో కనుక అశ్రద్ధచేయడంవల్ల అక్కడ వ్యవసాయం దెబ్బతింటోంది. ఎందువల్ల ప్రభుత్వం ఆ చెరువులకు మరమ్మతులు చేయించడంలేదు? Private tanks కు repairs చేయించడం విషయంలో ఆయకట్టు దారులనుంచి ఆ repairs కు అయ్యేఖర్చు వసూలుచేసేటట్టు ప్రభుత్వం policy గా తీసుకుంటుందా?

The Hon. Sri K. KOTI REDDI :— Private tanks కు మరమ్మతులు ఉన్నా, ఏమైనా breaches పడినా, వాటిని ప్రభుత్వం repair చేసి, ఆ ఖర్చయిన డబ్బును proprietors వద్దనుంచి సాధారణంగా రాబట్టటం జరుగుతుంది. ఆ proprietors కనుక ఇవ్వక పోతే, ఆ చెరువుక్రిందనున్న ఆయకట్టుదారులపైన అభివృద్ధిపన్ను విధించి గాని, వారిని అడిగిగాని వారివద్దనుంచి రాబట్టవచ్చును.

Sri B. KRISHNAMURTHY RAO :— చెరువు, వ్యక్తి పరంగా ఒకరి స్వాధీనంలో ఉంటే, దానికి, repairs కు గాను దాని owner దగ్గరనుంచి ఆ ఖర్చులను తీసుకోకుండా, ఆయకట్టుదారులను ఆ ఖర్చులను భరించమని అడగడం అంత సబబుగా, న్యాయంగా ఉంటుందా అని అడుగుతున్నాను.

The Hon. Sri K. KOTI REDDI :—Private చెరువుల repairకు అయ్యేఖర్చు ఆయకట్టుదారులనుంచే తీసుకుంటేనేకాని ఆ పనులు కాకుండా వుంటున్నవి. మనం దీనినిగురించి ఒక చట్టంచేయాలి. ఎందుకంటే proprietors ఏదో ఒక విధమైన rent ఏర్పాటుచేసి వుంటారు. ఆ rent ను increase చేసి ఆ విధంగా వారిదగ్గరనుండి తీసుకొనడానికి అవకాశము వుంటుంది. లేకపోతే ఆయకట్టుదారుల వద్దనుండి తీసుకొనడానికి ఏమీ చట్టంలేదు. ఆయకట్టదారులకు మీకు నీరుతప్పకుండా యిస్తామని, మీరు water rate హెచ్చుగా యివ్వాలని చెప్పి కొన్ని ఏర్పాట్లు చేశాము. దీనిని చెల్లించవలసినదిగా 1946-1948 సంవత్సరముల లోపల pass చేయబడిన ఒకచట్టాన్ననుసరించి ఆయకట్టదారులను అడుగుతున్నాము.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— ఈనాముల గురించి ఒక అరగంట డిబేటు జరగాలి అని కోరుతున్నాను. ఈ విషయమై సభ్యులు తమ అభిప్రాయం చెప్పడానికి, ప్రభుత్వం వివరంగా జవాబుచెప్పడానికి వీలువుంటుంది. Finance Minister గారు ఏదో బిల్లు తీసుకువస్తామంటున్నారు. అది ఎప్పుడో, ఏమిటో తెలియదు. Finance Minister చెప్పినదానికి, Revenue Minister చెప్పినదానికి భేదం కనిపిస్తోంది. ఈ పరిస్థితి ఆలోచించడానికి దయచేసి ఒక అరగంట వ్యవధి ఇప్పించాలి అని కోరుతున్నాను.

Mr. SPEAKER :— I think I have already allowed enough supplementary questions. So, I do not find any necessity for allowing half-hour debate.

Sri B. KRISHNAMURTHY RAO :— During the General Discussion of the Budget for 1954-55, the hon. Member may dwell on this subject at length.

## II. ADJOURNMENT MOTIONS.

Mr. SPEAKER: There is an adjournment motion given notice of by Sri Murthi Raju. I see the hon. Member is not present in the House. Hon. Members can throw out their suggestions on this subject during the next two or three days. This is an old trouble; as old as Adam and Eve.

Sri Potha Raju has given notice of an adjournment motion. The hon. Member can just read it and no more.

Sri T. POTHA RAJU:—Mr. Speaker, Sir, I beg to move the following adjournment motion:—

'This House stands adjourned to discuss a definite matter of urgent public importance of recent occurrence, namely, the situation arising out of the direct intervention of the I. L. B. by sending telegraphic orders to stay the Council meeting of the Vijayawada Municipality to be held on 24-3-1954, to discuss a resolution

signed by 26 out of 34 members of the Council expressing no confidence in the Chairman, thus causing grave discontentment, leading to serious consequences among the people of Vijayawada.'

Mr. SPEAKER:-I do not allow the motion; I rule it out of it order, as it does not involve an urgent matter of public importance,

(Sri Pillalamarri Venkateswarlu rose in his seat).

Mr. SPEAKER:—I am not allowing any discussion on my ruling.

Sri PILLALAMARRI VENKATESWARLU:అధ్యక్షా, గోతరాజుగారి adjournment motion గురించి మాట్లాడ్డానికి కాదు నేను లేచింది. కాని మీరు disallow చేసేటప్పుడు మంత్రివర్గంనుంచి దానిమీద ఏమైనా అభిప్రాయం తీసుకొని దానిని సభ్యులకు తెలియ చేసి తరువాత disallow చేయాలిఅని కోరుమన్నాను. ఇప్పుడు House లో ఒక adjournment motion చదవడం జరిగింది. దానిమీద కొన్ని వివరాలు తెలుసుకోవాలి. నిజంగా stay order ను ప్రభుత్వం పంపించిందా? ఈ విషయం తెలుసుకోవలసివున్నది. Disallow చేయ డానికి పూర్వం అసలువిషయం ఏమిటి అనేది తెలియచేయడానికి మంత్రి వర్గానికి అవకాశం ఇవ్వాలని మాతరఫున, మంత్రివర్గం తరఫున కోరు తున్నాను.

Mr. SPEAKER:— I am not allowing even half a second for any member to speak on my ruling. When I am disallowing the motion why should the hon. Member want to make a speech?

Sri PILLALAMARRI VENKATESWARLU:— It is not for making a speech I am rising now.

Mr. SPEAKER:—For what should the hon. Member rise then?

Sri PILLALAMARRI VENKATESWARLU:— I want to make a request to the Speaker.

9th March 1954]

Mr. SPEAKER:-If I have allowed the motion there may be room for making a request.

Sri PILLALAMARRI VENKATESWARLU:— If you are not allowing us even to make a request, how can we function here?

Mr. SPEAKER:—The hon. Member may make his request without making a speech.

Sri Murthy Raju may read his adjournment motion now.

Sri Ch. S. R. V. P. MURTHY RAJU:— అసెంబ్లీముందు adjournment motion చదువుతున్నాను.

That this Assembly stands adjourned to discuss a definite matter of urgent public importance, namely, failure of the second crop in the Godavari western delta due to the negligence of the Government.

విశ్వేశ్వరం లాకువద్ద మేటవేయడంవల్ల ఇపుడు గోదావరి western డెల్టాలోని భూమి అంతా చాలా ప్రమాదంలోవుంది. 3 లక్షల ఎకరాలతో పంట పాడైపోయేస్థితిలో వున్నది. ఆరు మాసాల క్రితం వచ్చిన వరదలవల్ల ఎడమగట్టు అంతా గండ్లుపడి central delta పాడైపోయింది. దానివల్ల central delta వారికి నష్టంవచ్చింది. ఇప్పుడు లాభం కలిగింది. కుడిప్రక్కన silt up అయిపోవడంవల్ల కర్నూలుపట్టణమంత లంక వేసినది. దానిని తీసివేయకపోవడంవల్ల మూడు లక్షల ఎకరాలకు western delta లో నీళ్లులేకపోవడం జరుగుతోంది. గవర్నమెంటు ఇంతవరకు చూడకుండా ఇలా వుండడంమూలంగా ప్రజలు చాలాబాధ పడుతున్నారు. ఇప్పుడు ఈ ఇసుకను తీసివేసి 500 అడుగులు వెడల్పు 20 అడుగులులోతు తీస్తేనేగాని డెల్టాను బ్రతికించడానికి వీలులేదు. ఈ విషయంలో కొంతమంది పనిచేస్తున్నారు. కాని ఏమీ ఉపయోగంకలిగే ఆశలేదు. అసలు గోదావరివరదలు అయిపోగానే Department వారు levels తీసికొని మామూలుగా ఎక్కడ silt up అయినదో చూసుకొని అక్కడ మరమ్మతు చేయవలసింది. అక్కడవుండే officers యొక్క negligence వల్ల గవర్నమెంటు action తీసికోని

[ 9th March 1954

కారణంగా western delta కు మూడుమాసములనుండి ప్రత్యేక Executive Engineer లేకుండా చేయడంవల్ల 3 లక్షల ఎకరాలలోని second crop కు నష్టంకలుగచేయడం జరిగింది. ఇది చూసినవారికి గాని అర్థంకాదు. Chief Engineer గాని మంత్రులుగాని గోదావరిజిల్లా దెబ్బతింటుంటే యింతవరకు ఎప్పుడూ చూడ్డంకనిపించడంలేదు. ఇంతవరకు ఏవిధమైన action తీసుకున్నట్లు లేదు. ఇప్పుడు వున్న పరిస్థితులు Chief Engineer గారు వెళ్లి చూడాలి. Proportionate water discharge అనేది ఇప్పుడు మన Chief Engineer గారు కళా వెంకట్రావుగార్ల వరప్రసాదం. దీని ఫలితంగా 10 సంవత్సరాలుగా western delta అంతా సర్వనాశనమైపోయింది. ఎన్ని చెప్పుకున్నా ఎవరూ వినడంలేదు. ఇప్పుడు western delta దెబ్బతింటోంది. Proportionate water discharge అనేది ఎందుకు పెట్టారో తెలియదు. దీనివల్ల మూడులక్షల ఎకరాల్లో 6 కోట్లరూపాయల పంటకు నష్టంవస్తోంది. నిరుడు సంవత్సరంలో గోదావరిలో నీటిమట్టం 5.3 అడుగులు వుంటే ఇప్పుడు 6.3 అడుగులు వున్నది. ఈ స్థితిలో డెల్టా దెబ్బతింటోంది. అంటే western delta కు వేరే Executive Engineer లేకపోడంవల్ల officers తగినశ్రద్ధ తీసుకోడంలేదు. ఇప్పుడు నీటిని వదలడంలో central delta కు ఎక్కువ prefarance ఇవ్వడం, western delta కు అన్యాయంచేయడం జరుగుతోంది. ఈవిషయంలో ప్రజలు పడేబాధ, జరిగిన అన్యాయము మేము చూడలేకపోతున్నాము. వెంటనే చర్యతీసుకుని కృష్ణానీరు కొంతవరకైనా western delta కు పంపించడానికి సావకాశంవున్నది. Chief Engineer గారు సహాయపడతాను, కృష్ణా Superintending Engineer గారికి వ్రాసాము అని చెప్పారు. ఈవిషయంలో telegraphic orders పంపించి కృష్ణనీరు ఏలూరువెళ్లే కాలువగుండా పంపించాలి అని కోరుతున్నాను. కృష్ణ ఆనకట్టపై ఒకఅడుగు వరకు నీరువున్నది. గాన western delta కు నీరు పంపుటకు వీలున్నది.

తరువాత ఈ తుంగభద్ర నీట్ని మనం కంట్రోలులోకి తీసుకురావలసిన అవసరం వున్నది. దానిని మనం వుపయోగించుకోవలసినంతగా వుపయోగించుకోనడంలేదు. తుంగభద్రనీరు, కృష్ణానీరు వెస్టర్న డెల్టాకు వుపయోగించనందువల్ల నష్టంకలుగుతున్నది. గోదావరినదికి రిజర్వాయరు ఎందుకు కట్టారో నాకు అంకాకుండా వున్నది. 3 లక్షల

ఎకరాలు 6 కోట్లరూపాయలు ప్రథమపంటకు వస్తుంది. ఇంతవరకు గవర్నమెంటు ఏ విధంగా యీ విషయములో పని చేసింది? శబరి ప్రాజెక్టుగావరి ఒక రిజర్వాయరు కట్టేందుకు ప్రభుత్వం చర్యతీసుకోవాలి శబరిప్రాజెక్టు వల్ల ప్రత్యేకముగా western delta లో మాత్రమే 3 లక్షల ఎకరములు రెండు పంటలు వచ్చును. తరువాత తుంగభద్రా వాటరు సరిగా వాడుకోక పోవడంలో మాకు చాలనష్టం కలుగుతుంది. కృష్ణనీరు యిందువల్ల కొంత వరకు వేస్టు అవుతుంది. Krishna delta వుపయోగంగురించి మీరు యిచ్చినటువంటి గ్యారంటీ అములులోపెట్టాలి. అందుచేత ఏప్రిలు నెలాఖరుకు తుంగభద్ర వాటరు కృష్ణానది నుంచి పశ్చిమగోదావరి డెల్టాకు రావడానికి భారతప్రభుత్వాన్నైనా తప్పకుండా సహాయం అర్థించాలి. వెస్టర్ను డెల్టా రైతుల గురించి ప్రభుత్వం జాగ్రత్తగా ఆలోచించాలని నా మనవి. గోదావరి డెల్టాలో సుమారు 3 లక్షల ఎకరాలకు సంబంధించిన విషయం కనుక యిది definite matter అయింది. తరువాత కొన్ని కోట్లరూపాయల నష్టం వస్తున్నది కాబట్టి, ఆహారానికి కొరతవస్తుంది కాబట్టి యిది matter of urgent public importance. ఇది రైతులకు సంబంధించిన విషయంగాని ప్రత్యేక వ్యక్తికి సంబంధించినదికాదు. పైనుపెనేకాను అందుచేత వెంటనే చర్యతీసుకుని పశ్చిమగోదావరి డెల్టాకు చీఫ్ఇంజనీరును వెంటనే పంపించాలని, దీనిలో ఎట్టి విలంబన జరగకుండా చూడాలి. వెంటనే పశ్చిమడెల్టా ప్రాంతాలకు ఒక Executive Engineer ను గాని అధమపక్షం ఒక అనుభవమున్న, divisional officer ను గాని వేయవలసిందని కోరుతున్నాను ఈ పొరపాటును యికముందైనా సవరించుకోవాలని కోరుతున్నాను. తుంగభద్ర వాటరును పశ్చిమగోదావరి డెల్టాకు తరలించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

Mr. SPEAKER:—Leave is refused. This matter can be discussed at length during the budget debate.

Sri PILLALAMARRI VENKATESWARLU:—It has already been discussed.

Sri T. POTHA RAJU:—అయ్యా, Point of order. మూర్తిరాజుగారి adjournment motion విషయంలో ఏపద్ధతి అనుసరిం

చాకో అది చాలా బాగుంది. ప్రతి adjournment motion విషయంలో యిలాంటి అవకాశంయిచ్చి యిదేపద్ధతి అనుసరించాలని నాయొక్క అభిప్రాయము. అయితే మూర్తిరాజుగారి adjournment motion కు నేను యిచ్చిన adjournment motionకు తేడా ఎక్కడవచ్చినదో నాకు అర్థం కావడంలేదు. నా adjournment motion ను చదవమన్నారే గాని దానిగురించి మాట్లాడ్డానికి ఒకటి రెండు నిముషాలుయిచ్చి explain చేయడానికవకాశం యివ్వలేదని విచారిస్తున్నాను. మూర్తిరాజుగారికి 10, 15 నిముషాలు యిచ్చారని సంతోషించాను. కాని యికముందు కూడా అన్ని adjournment motion లకు యీవిధంగానే అవకాశం యిస్తారని ఆశిస్తున్నాను. ఈ తేడా నాకు అర్థంకావడంలేదు.

Mr. SPEAKER:— The hon. Member can have 15 minutes for this during the discussion on the budget.

Sri. PILLALAMARRI VENKATESWARLU:— అధ్యక్షా, Point of order. I am rising on an entirely different matter.

Sri. G. NAGABHUSHANAM:— The hon. Member Sri Potha Raju, in his observations has cast a reflection on the chair. The Chair gave a ruling and it is the duty of the hon. Members to obey. But the observations made by Sri Potha Raju constitute a reflection on the Chair and this shows our attitude towards parlimentary procedure.

Mr. SPEAKER:-The Chair knows it and it is cultivating patience.

Sri PILLALAMARRI VENKATESWARLU:— మా వుద్దేశ్యము అది కాదు. మంచి పని చేశారు అని చెబుతున్నాము. Chair మీద reflection యివ్వడం మా వుద్దేశ్యం కాదు. మీరు యిచ్చినటువంటు ruling ను గౌరవిస్తున్నాం. ఏదో బుర్రలోకి వచ్చినట్టు వారు మీముందు పెట్టారు. అది సరియైనది కాదు. Chair మీద aspersions వేయడం మావుద్దేశంకాదు. మూర్తిరాజుగారి adjournment motion విషయంలో మీరు సరియైన విధానం అవలంబించారనీ, మద్రాసు అసెంబ్లీలోకూడా యిదే విధానం అవలంబిం

చారనీ, అన్ని adjournment motions విషయంలో యిదేవిధంగా వుండాలనీ మనవిచేశాం. అంతే; ఒకవిషయం నిమీాముందుపెట్టాం. దానిని గురించి ముఖ్యమంత్రిగారు, సంజీవరెడ్డిగారు, విశ్వనాథంగారు ఏమైనా చెబుతారేమోనని ఆశించాము. మీాదృష్టికి తీసుకవచ్చాం. ఇలాంటి adjournment motion విషయంలో యికముందుకూడా యిట్టి విధానంనే అవలంబిసారని ఆశించాము; అంతేగాని Chair పైన aspersion వదలడం మాయొక్కగాని, మాపార్టీయొక్కగాని వుద్దేశ్యంకాదు, అని విన్నవిస్తున్నాను. వారి బుర్రలో పనిచేస్తున్నది వేరు.

Mr. SPEAKER—I have not taken it as an aspersion on me.

I am not totally unaware that there is something behind it, but I do not want to say anything on it.

Sri G. NAGABHUSHANAM:—On a point of order about బుర్రలో ...

Mr. SPEAKER—I am not taking it seriously. Why should the hon. Member bother?

## III. BUDGET FOR 1954-55.

### GENERAL DISCUSSION OF THE BUDGET.

Mr. SPEAKER—We will now start general discussion on the budget. Sri Pillalamarri Venkateswarlu will start the discussion on behalf of the Leader of the Opposition and he will be allowed, as a special case, half an hour. The other hon. Members will have 10 minutes each. Only two parties have sent the names of speakers. There is the third section consisting of all other parties and they have not sent any names. Members from each party will be called alternately.

Sri PILLALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా ఇది రెండవతడవ విశ్వనాథంగారు budget ను సమర్పించడము. అయినా దీనిని మొదటి Budget క్రిందనే తీసికోవాలి. గత budget లో వారిచ్చిన వివరాలు composite State లో యివ్వబడినవే. కాని యీా budget వారిచేతులతో వారి సంతకముతో తయారైన

వసుట లేదు, అంతేకాదు. యీ ఉపన్యాసములో అన్ని సమస్యలనుగురించి ప్రస్తావన చేయలేదు. Expenditure ను తగ్గించడానికి యేవిధమైన చర్యయాలు తీసుకోవాలో అనేదానినిగూర్చి budget లో చెప్పలేదు. దానిని తగ్గించడానికి యేమార్గాలు ఆలోచించగలుగుతున్నారో budget లో చెప్పలేదు. ప్రజల ఆర్థికపరిస్థితి, ప్రజలకొనుగోలుశక్తి పెరిగాయన్నారు. ఎక్కడ పెరిగాయి. ఎక్కువమంది మధ్యతరగతి ప్రజలు కూడ రిక్షాలులాగుకునే హీనస్థితిలో వున్నారు. రోజురోజుకు ప్రజల జీవితము అధ్వాన్నమైపోతుంది. చిట్టచివరకు budget లో ఒక కోటి రూపాయలు పన్ను ప్రజలనుండి వసూలు చేయబోతున్నామని అంటున్నారు. రూపాయలు వసూలు చేయడము మాటలా! ప్రజలు పన్ను చెల్లించే పరిస్థితులలో వున్నారా? ముఖ్య budget లో చాలా లోపాలున్నాయి. కాని ఆ లోపాలను తీర్చారా అంటే తీర్చలేదు. Officers యొక్క సంఖ్య తెలుపలేదు. వాండ్ల జీతాలనుగురించి చెప్పలేదు. మనకు ఏఏ Department లలో ఎందరున్నారో తెలియదు. మొత్తము ఎంత ఖర్చుకాబోతుందనే వివరాలు మాత్రము మనకు యివ్వడము జరుగుతున్నది. యీ వివరాలు యివ్వడముకన్న మొత్తము ఎన్ని Estimates ఉన్నాయి, పూర్వముకంటె క్రొత్తవి యెన్ని, ఎన్ని works తీసుకున్నారు. ఆ works కు పూర్వము ఎంత ఖర్చుఅయినది. యీ సంవత్సరము ఎంత ఖర్చు పెట్టబోతున్నారు, అనే వివరాలు కన్పించడములేదు. యీ సంవత్సరము యింత allot చేస్తామంటారు. అసలు ఖర్చుపెడుతున్నారా అనే అనుమానముంది. విశ్వనాథంగారి ఉపన్యాసము చదివితే అనుమానానికి ఆస్కారం లేకపోలేదు. Revenue Estimatesలో చాల variance వుంది. జిల్లా అధికారులనుంచి వచ్చిన లెక్కలనుబట్టి అంచనాలు తయారుచేస్తామంటారు. యీ వ్యత్యాసము ఎందువల్లవచ్చింది. అంతేగాదు. గతములో వచ్చిన మార్పులు చాలావున్నాయి. ఈ budget లో ప్రధానంగా అనేక లోపాలున్నవని చెబుతున్నాను. ఇవన్నీ తప్పనిసరిగా సరిచేసుకోవలసిన అవసరము వుందని మేము అనుకుంటున్నాము. మైనర్ వర్క్సుక్రింద పూర్తి వివరములు తెలుపబడలేదు. సివిల్ వర్క్సు (50A) లో మైనరు వర్క్సుక్రింద 12 లక్షలు ఖర్చు అవుతుందని, అందులో 6 లక్షల మైనర్ వర్క్సుకు వివరములు యివ్వకుండా "మైనర్ వర్క్సుక్రింద" అని

Sri Pillalamarri Venkateswarlu] [9th March 1954

ప్రాసుటం జరిగింది. ఈఖర్చు దేనికి? గోడలకు సిమెంటు పూయటానికా? ఇంటిలో రంగులు వేయటానికా? దేనికైనదీ వివరములులేవు. (50D) లో rates and taxes క్రింద 7 లక్షలని అన్నారు. దీనిలో గవర్నరుగారి కోసము ఎంతైనదీ వివరములు యివ్వలేదు. ఈ rates దేనికి? ఏమి టాక్సులు? వీటివివరములు యివ్వవలసిన అవసరంవుంది. Top heavy expenditure ను గురించి 1946 నుండి నేను చెబుతూనే ఉన్నాను. గవర్నరుగారి జీతాలు I. C. S. వుద్యోగస్తుల జీతాలు ఇట్లా రెండేసి వేలు పదిహేనువందలు, వెయ్యిరూపాయల చొప్పున, భరించలేమని చెపుతున్నాను Andhra State ఒకవంక డబ్బులేక చాలా అవస్థలు పడుతుంటే, యీ జీతాలు తగ్గించడానికి ఏమైనా ప్రయత్నాలు చేస్తున్నారా? మంత్రులకు 500 రూపాయలు జీతాలు వుండాలని మేముఅంటే చాలవని, మంత్రిగారు మళ్ళీ పెట్టారు. నేను ఒక్కవిషయం చెప్పుతున్నాను. ఇంతింత పెద్దపెద్దజీతాలు వుద్యోగస్తులక్రింద ఖర్చుపెడుతుంటే, top heavy expenditure తగ్గించలేము. ప్రజలనుండివచ్చే ఆదాయము 21 కోట్లు, ఖర్చు 24 కోట్లు అవుతున్నది. ప్రొహిబిషన్ విషయంవస్తే అది కాంగ్రెస్ సిద్ధాంతం అంటారు. ఇట్టి విషయాలలో ఆ సిద్ధాంతాలు ఏవీరావు. కాబట్టిఈ top heavy expenditure తగ్గించాలని సూచిస్తున్నాను. ఈ ఆంధ్రరాష్ట్రము పుట్టి 6 నెలలయింది. ఇంతలో ఇంత పెద్దపెద్ద జీతాలు మనము భరించగలమా? ఉద్యోగస్థులను తగ్గించమని నేను అనను, ఆవిధముగా నేను సూచించడములేదు. పెద్దపెద్ద జీతాలు తగ్గించమని చెబుతున్నాను. Police Department క్రింద చాలా ఖర్చుపెట్టుతున్నారు. D. S. P. లు Dy. S. P. లు ఇలాంటి ఎన్నోగ్రేడులవారు వున్నారు. ఇందులో కొన్ని పోస్టులు ఎక్కువగా పెంచబడినవి. పెద్దపెద్ద వుద్యోగస్తులను తగ్గిస్తేగాని యీసమస్య పరిష్కారముగాదు. అప్పుడు మన ఆయవ్యయాలను కొంత balance చేసుకోగలము. (Special Armed Police) క్రింద ఎంతగానో ఖర్చుపెడుతున్నారు. కాంపొజిట్ State లో వున్నప్పుడు ఇంతఖర్చులేదు. ఈ S. A. P. క్రిందయినా 18 లక్షలు ఎందువల్ల పెడుతున్నారు? వీరు చేసేపనులు మామూలు పోలీసులు చేయగలరు. ఈ S. A. P. లు వుండటంవల్ల జరిగేది ఏమీలేదు. ఇప్పటి పరిస్థితులలో వీరు అవసరములేదు. 25 లక్షలు వీరిమీద ఖర్చుపెట్టడం అనవసరం. కాబట్టి ఈ పోలీసు

Sri Pillalamarri Venkateswarlu] [9th March 1954

వేస్తే ప్రజలకు మనము ఏమీ సహాయం చేయలేని వారమవుతాము. ఆ 8 లక్షలైనా చెరువుల మరమ్మత్తులకు ఖర్చు పెట్టితేబాగుగా వుంటుంది. అట్లు కాకుండా గవర్నరుగారి ఖర్చులక్రింద 18 లక్షలు ఖర్చు పెట్టుతూ యీరకంగా ఎంత కాలము నడుపుతారు.

తరువాత ఈ P. W. D. civil works అన్నీకూడ contractors కు ఇవ్వడం జరుగుతున్నది. ఈ కంట్రాక్టర్లు ఏ విధంగా అన్యాయంగా ప్రభుత్వ డబ్బంతా కాజేస్తున్నారో చూస్తున్నాము. నిన్న బస్సులో వెళ్ళుతూవుంటే కొంతమంది ఈ కంట్రాక్టర్లగురించి ఈ విధంగా మాట్లాడు కొంటున్నారు. రోడ్లకు నీళ్ళు వేసే విషయములో, వాన వచ్చినరోజు కూడ రోడ్డుకు నీళ్లు వేసినట్లుగా ఆ రోజుకుగూడ ఖర్చు చూపుతూ కంట్రాక్టర్లు బిల్లుచేశారని, ఆ బిల్లును ఆమోదించడం జరిగిందని అనుకొంటున్నారు. ఈ విధంగా దేవుడు వేసిన నీళ్ళకుకూడ వీరే నీళ్లువేసినట్లు దానిక్రింద డబ్బు తీసుకొంటున్నారు. దీనివల్ల మనకు చాలా నష్టమువస్తున్నది. ఇప్పుడు తుంగభద్రా ప్రాజెక్టు కట్టించారు. ఆ పనిని చిన్న చిన్న భాగాలుగా విభజించి, వాటిని కంట్రాక్టర్లద్వారా, వారిమీద supervision వేసి చేయిస్తున్నారు. ఆ విధంగానే కృష్ణా-రెగ్యులేటర్ బ్రిడ్జి విషయములోనూ, దానిని చిన్న చిన్న విభాలుగా విభజించి, supervision క్రింద వాటిని కంట్రాక్టర్లకు యిస్తే, అంత అన్యాయము జరుగదు. ఈ కంట్రాక్టర్లకు స్వస్తిచెప్పినట్లయితే, మనకు కొన్ని లక్షలో, లేక కోట్లో మిగిలే అవకాశమున్నది. కనుక దీనిని ప్రభుత్వము చాలా జాగ్రత్తగా ఆలోచించవలసి యున్నది. తరువాత Medical క్రింద ఒక కోటి, మూడులక్షలు ఖర్చు చూపించారు. మందులకుగాను, 23 లక్షలు చూపించారు. కాని ఆఫీసర్ల జీతముక్రింద మాత్రము 44 లక్షలు చూపించారు. ఇంత వ్యత్యాసము ఏవిధంగా వచ్చిందో బడ్జెటును ఒకతడవచూస్తే విషయాలు బోధపడుతవి. ఇళ్ళ స్థలాల విషయములో, హారిజనులను ఉద్ధరించేటట్లు చెప్పుతూవుంటారు, సంజీవయ్యగారు గూడ చెప్పవచ్చును. ఈ new housing scheme క్రింద, 53 వేల రూపాయలు చూపించారు. Rural housing societies కు గాను 2 లక్షల, 25 వేలు ఇచ్చారు. అదే విధముగా co-operative housing societies కు 30 లక్షల రూపాయలు ఇచ్చారు. Handloom weavers కు గాను, వాళ్ళ housing scheme క్రింద

Sri Pillalamarri Venkateswarlu] [9th March 1954

18 లక్షలు యిచ్చారు. ఈ co-operative housing societies ఇచ్చేటటువంటి 30 లక్షలు ఎవరికిగాను, ఎవరికోసమై యిస్తున్నారని అడుగుతున్నాను. ఇది నిజంగా డబ్బులేనివారికి పోతున్నదా, లేక డబ్బుగల, పలుకుబడిగలిగినటువంటి రాజకీయపార్టీ వ్యక్తులకు పోతున్నదా ఆలోచించుకోమ్మంటున్నాను. రాజకీయపార్టీ వ్యక్తులకే పోతున్నదనే విషయం స్పష్టంగా తెలుస్తున్నది. పేర్లు చెప్పదలచుకోలేదు. పేరుచెప్పితే కోపము తెచ్చుకొంటారు. కనుక చెప్పదలచుకోలేదు. అయితే, వారికే అర్థంకాగలదు. మద్రాసులో విషయాలు చూసుకొన్నప్పటికీ, ఈనాడు మన ఆంధ్రరాష్ట్రములో జరుగుతున్నది చూసుకొన్నప్పటికీ, ఎవరికోసం యింతడబ్బు ఈ housing societies కు ఇస్తున్నామో తెలుస్తూనేయుంది. ఈనాడు handloom weavers ఎన్ని అగచాట్లు పడుతున్నది మనం చూస్తున్నాము కదా! వారిని గురించి ఎంతో సానుభూతి తెలియజేస్తూ పబ్లిక్ మీటింగులలో అందరు మాట్లాడమే కాని, కార్యరూపములో వారికేమీ ఉపకారము జరగడంలేదు. లేకపోయిన వీరికి housing క్రింద 18 లక్షలు మాత్రమే చూపడం, Co-operative Societies అనే పేరుక్రింద రాజకీయపార్టీ వ్యక్తులకు 30 లక్షలు కేటాయించడం ఎందుకని అడుగుచున్నాను. హరిజనులకు 1948 వ సంవత్సరము నుండి 1952 వరకు house sites ఇస్తున్నామంటున్నారు. అది ఎంత మట్టుకు ఇచ్చారో లెక్కలుచూస్తే బోధపడుతుంది. ఇంతవరకు 92 గ్రామాలలో 720 ఎకరాలు బంజర్లు యిచ్చారు. తరువాత, 120 గ్రామాలలో 590 ఎకరాలను ప్రయివేటు వ్యక్తులనుండి acquisition చేసి యిచ్చారు. ఈ 4 సంవత్సరాలనుంచి కాంగ్రెసు గవర్నమెంటు హరిజనులకు చేస్తున్నటువంటిది ఇంతమట్టుకే. Intensive and extensive cultivation కోసమై 8 లక్షలు ఖర్చుచేస్తున్నారు. దీనికొరకు 8 లక్షలుకాదు, 8 కోట్లు ఖర్చుపెట్టినప్పటికిని, ఇది failure అవుతుంది. ఇదివరకే fail అయిపోయింది. మరల దానికొరకు 8 లక్షలు ఖర్చు పెట్టడమంటే, ఇది నిజంగా ప్రజలకు ఉపయోగపడలేదని మనవి చేస్తున్నాను. ఇది ప్రభుత్వధనాన్ని దుర్వినియోగం చేయడం తప్ప మరేమీ కాదు. కనుక దీనిని వెంటనే ఆపుచేయాలని కోరుచున్నాను.

తరువాత రెవిన్యూబోర్డు వున్నది. ఇది పోవాలని కోటిరెడ్డిగారు కూడ పత్రికలలో చెప్పారు. విశ్వనాథంగారు కూడ ఈ విషయము

Sri Pillalamarri Venkateswarlu] [9th March 1954

చెప్పుతూ వచ్చారు. మొన్న కోటిరెడ్డిగారు మరల ఇది పోవాలనే చెప్పారు. కాని, బడ్జెటులో ఏమైనా దీని సూచన వున్నదా అంటే లేదు. ఈ రివిన్యూబోర్డువల్ల ఏమీ ప్రయోజనము లేకపోగా, దానివల్ల డబ్బు ఖర్చుఅవుతున్నది. దీనివల్ల లాభముకంటే నష్టమే ఎక్కువగా అవుతున్నది. దీనిలోనే red-tapism కూడ ఎక్కువగా వుంటున్నది.

ఇక School of Indian Medicine ఒకటి start చేస్తున్నామని చెప్పారు. కాని బడ్జెట్ figures లో ఎక్కడా కూడ దానికిగాను ఇంత డబ్బు కేటాయించినట్లుగాని, ఫలానా సంవత్సరములో ఏర్పాటు చేస్తామనే సూచనగాని లేదు. ఉపన్యాసములో మాత్రము చెప్పారుగాని, ఈ School ఎక్కడ, ఎప్పుడు ప్రారంభించబోతున్నారు, మొదలగు వివరాలు ఎందుకు యివ్వలేదని అడుగుతున్నాను. ఈవిధంగా ఈ విషయములో ఏలాంటి నిర్ణయంలేకుండా, దానికి ఏవిధమైనటువంటి plans, estimates లేకుండా చేయడం ఎందుకు అని అడుగుతున్నాను.

తరువాత Revenue Estimates విషయములో, composite State తో పోల్చిచూస్తే, చాలా వ్యత్యాసాలు కన్పడుతున్నాయి. దీనికి ఏ విధమైన explanation కన్పడడంలేదు. Land Revenue క్రింద Composite State లో 4 కోట్ల, 95 లక్షలువుంటే, యిప్పుడు మన బడ్జెటులో 4 కోట్ల, 78 లక్షలని సూచించారు. ఇదివరలో, 3, 4 సంవత్సరములు కరువు కాటకాల మూలకంగా, రెమిషన్ ఇవ్వవలసి వచ్చిన పరిస్థితులలో కూడ, 4 కోట్ల 95 లక్షలు అయినప్పుడు, ఇప్పుడు 4 కోట్ల, 78 లక్షలుమాత్రమే చూపించారు. ఇంత తగ్గడానికి కారణమేమిటి అని అడుగుతున్నాను. దీనియొక్క అంతరార్థం ఏమిటో తెలియడం లేదు. మనకు land revenue తగ్గడానికి అవకాశంలేదు. వర్షాలు బాగా కురిశాయి, పంటలు బాగా పండాయి, రెమిషను అవసరం వుండదు అని విశ్వనాథంగారు చెప్పారు. కాని, ఇంత తక్కువ మొత్తము ఎందుకు చూపించారో అర్థంకావడం లేదు. State Excise Duties క్రింద, 2 లక్షలు తక్కువ చూపబడింది. Composite Stateలో మనకు వస్తూవున్నటువంటిది, 3 కోట్ల, 29 లక్షలైతే, యిప్పుడు 3 కోట్ల

9th March 1954] Sri Pillalamarri Venkateswarlu]

18 లక్షలు చూపించారు. ఆంధ్రదేశములో ఖచ్చితంగా, ఇంకా ఒక కోటి రూపాయలు ఎక్కువగా వస్తుందని విశ్వనాథంగారు మద్రాసు అసెంబ్లీలో చెప్పారు. కాని, ఈనాడు, ఈ మొత్తం ఏ కారణంవల్ల తగ్గిందో అర్థంకావడం లేదు. Tobacco tax క్రింద 8 లక్షలు తగ్గింది, Entertainment tax క్రింద 9 లక్షలు తగ్గింది, Agriculture క్రింద 18 లక్షలు తగ్గింది, Civil works యొక్క ఆదాయము 22 లక్షలు తగ్గించబడింది. ఇవన్నీ కలుపుకొని, మొత్తంమీద చూచినట్లయితే, ఒకకోటి, 34 లక్షలకు పైగా తగ్గిపోయినట్లు కన్పడుతున్నది. ఇది ఎందుకు తగ్గిందో అర్థంకావడం లేదు. దాదాపు 50 వేల గ్రామాలకు అదనపుపంటకు నీరు యిచ్చారు. దానివల్ల కొంత అదనంగా పన్నువస్తుంది. Sales tax వల్ల, బాగా ఆదాయం వస్తుంది. ఇదంతా వస్తూయుండికూడ ఆదాయము తగ్గడానికి ఏమి కారణమో తెలియడం లేదు. దీనికి తగిన వివరాలు, బడ్జెట్ మెమోరాండంలో సరిగా లేవు. దీనిని ప్రభుత్వము జాగ్రత్తగా ఆలోచించవలసిన అవసరమున్నది.

అందువల్ల నేను చెప్పేది ఏమిటంటే, ఈ Budget Estimates మరల revise చేయడానికి మన Assembly నుంచి ఒక కమిటీని వేయాలని నేను భావిస్తున్నాను.

తరువాత Partition కమిటీ వివరాలు యిదివరకే బైటికి వచ్చి యుండవలసింది. ఇంతవరకు బైటికి రాకపోవడానికి కారణము ఏమని అర్థము చేసుకోవాలి? ఇదంతా మరచి పోయారేమోనని నాకు తెలియదు. Partition కమిటీ వివరాలు ఏమిటో త్వరలో బైటపెట్టమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అందులో లచ్చన్నగారు, విశ్వనాథంగారు, సంజీవరెడ్డిగారు వున్నారు. Special Officer గావున్న త్రివేదిగారు వేసిన Partition Committee యే. దాని వివరాలు త్వరలో బైట పెట్టండి. దాని వివరాలు శాసన సభ్యులకు తెలియజేయవలసిన అగత్యము లేదని యీ ప్రభుత్వం భావిస్తున్నదా?

Prohibition రద్దు చేస్తామని అంటూ ఒక కమిటీనివేశారు. ఆకమిటీ రిపోర్టు వచ్చింది. ఆకమిటీవారు చేసిన సూచనలను ప్రభుత్వం యింతవరకు అంగీకరించలేదు. ప్రభుత్వాన్ని అడిగితే consider చేస్తున్నామని అంటారు. ఎన్నాళ్లు యీ consideration? ఇంతవరకు

9th March 1954 ] Sri Pillalamarri Venkateswarlu]

ఇంకొక విషయం నుడవి చేస్తున్నారు. రాయలసీమలోని educational institutions అన్నీ ఆంధ్రయూనివర్సిటీలో affiliate చేయటానికి చాలా ఆతురత పడుతున్నామని శ్రీ విశ్వనాథంగారు చెప్పారు. తిరుపతి యూనివర్సిటీ affiliated University యా? లేక residential University యా, ఏదైనదిన్నీ చెప్పలేదు. ఈ యూనివర్సిటీకి తిరుపతి దేవాలయం ఆదాయంలోనుంచి ఖర్చుపెట్టటానికి ఎవరు కూడా అభ్యంతరము పెట్టరు. నెల్లూరు జిల్లాలోని కళాశాలలలో చేర్చటానికి అభ్యంతరాలు ఏమిటో తెలియజేయడం లేదు. ఆ అభ్యంతరాలు ఏమయిందిన్నీ చూస్తాము. ఆంధ్రదేశములో వున్న ప్రజానీకాన్నంతా ఐకమత్యం చేయటానికి చేసేపనులు ఏమిటో చెప్పమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ప్రభుత్వం యీ యూనివర్సిటీ విషయంలో చేస్తున్న పనులు అన్నియు చూస్తే, ఎక్కడికక్కడకు చీలికలు చేసి, ప్రాంతీయ అభిమానాలను రెచ్చకొట్టటానికి చూస్తున్నట్లు కనబడుతున్నదని హెచ్చరిస్తున్నాను. ఎవరైతే యీ బాధ్యతను నిర్వహించటానికి పూనుకుంటున్నారో, వారికే నేను యీ ప్రశ్న వేస్తున్నానని తెలుసుకోవాలి.

తరువాత Land Revenue Reforms గురించి చాలా చెప్పారు. దానివిషయంలో agricultural labourers ను గురించి ప్రభుత్వం rules ను తయారుచేస్తున్నామని చెప్పారు. ఆరూల్సు యేవిధంగా వుంటువో ఎందుకు బైట పెట్టగూడదు? అంతామార్చుతామని అంటున్నారు. కోటిరెడ్డిగారు వారివద్ద 18 వేల objections వచ్చియున్నవి అని చెప్పారు. ఇన్నివేల objections వుంటే, వారు ఏమి చేశారు అని అడుగుతున్నాను. అవియేమి చేయటానికి వారు పూనుకుంటున్నారో, ఏవిధంగా dispose of చేయదలచారో చెప్పడము లేదు. తరువాత రైతులకు moratorium ప్రకటిస్తామని అంటూవున్నారేకాని, యింతవరకు దాన్ని ప్రకటించలేదు. కూలీలచట్టము తీసుకొని వస్తామని చెప్పారా అంటే అదీగూడా కనబడదు. అభివృద్ధి, అభివృద్ధి అంటారేగాని యిప్పుడు ప్రభుత్వము యొక్క విధానము అభివృద్ధికి ఏవిధంగా తోడ్పడుతుందో అర్థంకావడంలేదు. విశ్వనాథంగారిని అడిగితే, వారు నాకు తెలియదు అనగలరా అని అంటున్నాను.

కృష్ణాజిల్లాలో 25 వేల ఎకరాల భూములు పెద్దపెద్ద భూస్వా

Sri Pillalamarri Venkateswarlu] [9th March 1954

ములు, జమీందార్లు అనుభవిస్తున్నారు. ఈ భూమిని ప్రభుత్వం ఏ విధంగా స్వాధీనం చేసుకొని పంపకము చేస్తుందని,- ప్రశ్నిస్తున్నాను.

తరువాత కొత్తపన్నుల విషయంచెప్పి ముగిస్తాను. నాకుఇచ్చినటైము చాలనందున త్వరలో ముగించదలచుచున్నాను. ప్రజలమీద కొత్త పన్నులు వేయటానికి ప్రభుత్వం పూనుకున్నది. ఇందులో ముఖ్యమైనది పొగాకు ఈ పొగాకు పండించే రైతులు ఆర్థికస్థోమతుపోయి, కొనుగోలు శక్తిలేక అలమటించిపోతున్న సమయంలో ప్రభుత్వం వీరిమీద యింకను పన్ను వేయటానికి చూస్తున్నది. పొగాకురైతులస్థితి యీనాడు ఏవిధంగా క్లిష్టంగా వున్నదో అందరికి తెలుసు. వీరికి ఆదాయం తగ్గటానికి కారణం, వీరు యిచ్చిన లెక్కలు ప్రభుత్వం అంగీకరించకపోవడము తప్ప మరేమిటో గుర్తించాలి. ప్రజలయొక్క కొనుగోలుశక్తి పూర్తిగా పడిపోయినందువలననే, వీరు అనేక యిబ్బందులను ఎదుర్కోవలసి వస్తున్నది. వీరికి రక్షణ యివ్వటానికి బదులు, అదనంగా కొత్తరకమైన పన్నులువేసి బాధింప చూస్తున్నారు. ఆంధ్రరాష్ట్రం వచ్చినప్పటికీ యీ పొగాకు ఎగుమతి విషయములో సుమారు సంవత్సరానికి 20 కోట్ల రూపాయలు ఆదాయం ప్రభుత్వానికి రాకుండాపోతున్నది. రాష్ట్రమునకు ఆర్థికస్తోమతు లేనప్పుడు కేంద్రప్రభుత్వాన్ని, యితర రాష్ట్రాలమాదిరి, సబ్సిడీయివ్వమని ఎందుకు ఒత్తిడి చేయగూడదు. బెంగాలు, బీహారు రాష్ట్రాలకు కేంద్రప్రభుత్వం subsidy యివ్వడములేదు. మన ఆంధ్రరాష్ట్రము నూతనముగా ఏర్పడ్డదని, ఆర్థికస్థోమతు లేదని కేంద్రప్రభుత్వానికి తెలియదా ? ఈ ప్రభుత్వం యీ పన్నులువేసేబదులు, కేంద్ర ప్రభుత్వమునుంచి యీ subsidy వచ్చేటందుకు ఎందుకు ప్రయత్నించగూడదు ? మనము అడగటానికి తగినన్ని కారణాలు లేవా ? మనకు పరిశ్రమలులేవు. పెద్ద పెద్ద ప్రాజెక్టులు లేవు. Electricity schemes కూడా లేవు. ప్రజలకు కొనుగోలుశక్తి పడిపోవడంచేత, యీ కొత్తగా పన్నులు విధించకుండా కేంద్ర ప్రభుత్వమునే approach చేయమంటున్నాను. మన రాష్ట్రంలో ప్రాజెక్టులు పూర్తిఅయ్యేవరకు కేంద్రప్రభుత్వంనుంచి ఆర్థికసహాయం కోరడం తప్పా ? బెంగాలు రాష్ట్రములో ఎన్నో అభివృద్ధి ప్రణాళికలు కేంద్రప్రభుత్వ సహాయంతో నిర్వహించుకొంటున్నది. ఆ విధంగా మన

Sri P. Ranga Reddi ] [ 9th March 1954

విషయాలన్ని తీసుకొని, వాటిని పరిష్కారము చేయుటకు కావలసిన అన్ని ప్రయత్నాలు చేసినట్లు యీ budget నిరూపిస్తున్నది. ఇంకా చాలా విషయములు వున్నవి. ఆర్థికమంత్రిగారు అవన్ని చేశారా? అని అంటె అందులో యథార్థము లేకపోలేదు. వారు చేసిన విషయాలన్ని మరచిపోయినందున మాత్రంచేత, యింకాచేయాలి, యింకాచేయాలి అని అంటే, మనం యీ అనుమానాలుగా వున్న యీ నూతన ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వమునొక్క అస్తిత్వమును చూస్తే, అక్కడవుండే చిక్కులు తప్పకుండా బోధపడుతవి.

ఇప్పుడు ప్రభుత్వము చేసిన విషయాలలో ముఖ్యమైనది ఆహార విధానము. అది యేవిధముగా అమలుజరుపబడింది, దేశములో వుత్పత్తి అయిన ధాన్యానికి సరియైన ధరలు వుండి రైతులకు లాభించేటట్లుగా చేసిన నిర్ణయమునుబట్టి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము రైతులకు యెంతవరకు సహాయపడుతున్నదో అందరికీ తెలిసిన విషయము. అన్యాయమైన ధరలను అరికట్టడానికి యీ ఆహారవిధానము తోడ్పడుతున్నదీ లేనిదీ ఆలోచించుకోవచ్చును.

తరువాత, అనేకపర్యాయములు, అనేకసందర్భములలోగూడ యీ భూసంస్కరణలను గురించి, బంజరు భూములగురించి మాట్లాడుతూ, వాటిని త్వరలో పరిష్కారము చెయ్యాలని గత బడ్జెటు సమావేశములో అందరూ కోరిన విషయమే. దాని పరిష్కార నిమిత్తమై ప్రభుత్వముపై బాధ్యతవున్నదీ లేనిదీ, వారు యిచ్చిన అంకెలనుబట్టి స్పష్టముగా బోధపడగలదు. శివాయిజమా భూములు మొత్తము 4,06,662 యెకరములు వున్నాయని, ఆ అంకెల, వివరములు సేకరించడము జరిగింది. ఆలాగుననే బీదలస్వాధీనములోవున్న 2,41,471 యెకరము భూమి యీనాటివరకు బీదల స్వాధీనములోనే వున్నట్లు తెలుస్తున్నది. ఆ శివాయిజమాభూముల పైన, బీదల స్వాధీనములోగల భూములపైన, వారికి పట్టాలు యివ్వడానికి యెటువంటి ఆటంకమువుండదని నేను అనుకొంటున్నాను. వాటిని పరిష్కరించడములోకూడా అనేకచిక్కు సమస్యలు లేకపోలేదు. ఆభూములు బీదలస్వాధీనములో వున్నట్లుగా లెక్కలు పెట్టినప్పటికీ, అవి మరొకరి చేతులలో వున్నట్లు తెలుస్తుంది. ఇక కరణముల లెక్కలుచూస్తే, ఆ భూములు యింకొకరిచేతులలో వున్నట్లు కనబడుతుంది. ఈ చిక్కుల

9th March 1954 ] [ Sri P. Ranga Reddi

నన్నిటిని పరిష్కరించడానికి గాను, అన్యాయములు జరుగకుండా వుండు
టకుగాను ప్రభుత్వము చేయాలంటే కొంత వ్యవధి కావాలి. తెలంగాణల
ఇవన్ని సక్రమముగా అమలు జరుగక, ధరలు చాలా ఆందోళన కలిగించే
విషయముగా వున్నది. ఈ సమస్యల నన్నింటిని పరిష్కారము చేస్తున్నా,
శ్రీ వెంకటేశ్వర్లుగారు యింకా ప్రభుత్వము యేమిచేశారు? అని పదేపదే
అంటున్నారు. కాని యిందులో వుండే difficulties వారికి తెలి
సును. ఎందుకంటె, వారు గత సమావేశములో యీసమస్యలను సత్వ
రమే పరిష్కరించవలెనని చెప్పినారే గాని, యేవిధంగా పరిష్కరించ
వలెనో వారు ఆనాడుగాని, యీనాడుగాని చెప్పియుండలేదు. ఈ శివాయి
జమాభూములు పేదల స్వాధీనములో వుండే భూములుగాక, యింకా
6 లక్షల 25 వేలకు పైచిల్లర సాగుకు లాయకీ అయిన భూములు
వున్నట్లు లెక్కలనుబట్టి తెలుస్తున్నది. ఈ భూము లన్నిటిని యే విధంగా,
యే సూత్రాలప్రకారము యెట్లాగున పంపకముచేయాలో శ్రీ వెంకటే
శ్వర్లుగారు సూచిస్తే బాగుంటుంది. కాని వారు అదేమీ చెప్పడములేదు.
దాని పరిష్కారానికి ప్రభుత్వమునకు కొంత వ్యవధి అవసరము లేకపో
లేదు. అనేకమంది బీదలు దేశంలో యీభూములను అడుగుతున్నారు.
శివాయిజమాభూములు పేదల స్వాధీనములోవున్న భూములు పోను,
యిప్పుడు మిగిలివున్న 6 లేక 7 లక్షల యెకరముల భూమిని యేవిధంగా
పంపకము చేయాలనేది మనమందరముకలసి ఆలోచించవలసిన విషయము.
త్వరితగతిని పంచిపెట్టమంటే జరిగేదికాదు. పైగా ఆందోళనపడి, త్వరపడి
చేసినట్లయితే, చాలమందికి పలువిధాల అన్యాయాలు జరుగగలవు
అని నేను హెచ్చరిస్తున్నాను.

ఇక విశ్వవిద్యాలయముల విషయం చూచిన, ఎన్నో ఏండ్ల
నుండి రాయలసీమ ప్రజలు, విద్యార్థులుగూడా, రాయలసీమకు ప్రత్యేక
ముగా ఒక విశ్వవిద్యాలయము కావలెనని చెప్పి, అడుగుతున్నారు. ఈ
విషయము అందరికీ విదితమే. ఆ విషయంలో ప్రభుత్వము ముందంజ
వేసి, అటువంటి ప్రత్యేక విశ్వవిద్యాలయ స్థాపనకు పూనుకుంటే, దానికి
గూడా మిత్రులు ప్రతిపక్షంవారు క్రొత్తసమస్యలను కల్పించడము చాల
విచారకరమైన విషయము, మిక్కిలి శోచనీయము. వారుచెప్పేది యేమి
టంటే, తిరుపతి దేవస్థానములనుండి వచ్చే ఆదాయమునంతను రాయల
సీమకే ఖర్చుపెట్టవలెనని కోరుతున్నారు. ప్రభుత్వము రాయలసీమలో

Sri P. Ranga Reddi ] [ 9th March 1954

స్థాపించబోయే విశ్వవిద్యాలయమును, యిప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయమును యీ రెండిటినీ, అభివృద్ధిపర్చడానికి ప్రయత్నంచేస్తూంటే దానికి గూడా ప్రతిపక్షమిత్రులు మరికొన్ని క్రొత్తసమస్యలను కల్పించటము, ప్రాంతీయ దురభిమానములకు దారితీయగలదని ఆరోపించడము, యిట్టి అభూతకల్పనలు సృష్టించడము చాల విచారకరము. అటువంటి ద్వేషభావములు యెవ్వరికీ లేవని నేను నొక్కిచెప్పుతున్నాను. ఈ రెండు విశ్వవిద్యాలయములుకూడ సంపూర్ణాభివృద్ధి చెందవలెననే ఆశయము అందరికీ వున్నది. అందువలననే, యీ బడ్జెటులో యీ క్రొత్త, పాత విశ్వవిద్యాలయాల అభివృద్ధికి కొన్ని లక్షల రూపాయలను సేకరించి, వీటిఅభివృద్ధికి పూనుకొంటున్నామని స్పష్టంగా చెప్పబడివున్నది. అందులకు మనమందరము ప్రభుత్వమునకు అభినందనలు తెల్పవలయునని నేను అంటున్నాను.

ఇక, చేనేత పరిశ్రమ విషయంలోగూడ ప్రతిపక్షము తరఫున శ్రీ వేంకటేశ్వర్లుగారు మాట్లాడుతూ, ప్రభుత్వము యేమిచేశారు అని ప్రశ్నిస్తూవచ్చారు. చేనేత విషయంలో ప్రభుత్వము యెటువంటి శ్రద్ధ తీసుకొన్నదీ, ముందు యెటువంటి శ్రద్ధవహించ బూనుకొనున్నదీ, యిదంతయు క్లుప్తముగా బడ్జెటులో చెప్పబడింది. నిజమునకు, చేనేతపారిశ్రామికుల కోర్కెల నన్నింటినీ యీ ప్రభుత్వము సంపూర్ణముగా ఈడేర్చవలెనంటే, అంతయు యీ ప్రభుత్వమువారి చేతులలో లేదు. వారికి కావలసిన మిల్లునూలు, వారికి ప్రత్యేక నూలుమిల్లులు యివన్నికూడా కేంద్రప్రభుత్వమువారి చేతులలో ఉన్నాయి. ఈ విషయములోకూడా, ప్రత్యేకంగా వారికి చీరెలు, ధోవతలు తయారు చేయుటకు అనుమతినిస్తూ, మిల్లులు వాటిని తయారుచేయకుండా నిషేధిస్తూ, చేనేత వారికే ప్రత్యేకంగా కేటాయించమని అందరమూ చెపుతున్నాము. రెండవది, యీ ఖాదీ వుత్పత్తి యెందుకు? అని ప్రశ్నిస్తున్నారు. దానికై డబ్బు దండుగచేస్తున్నారని వారు అంటున్నారు. వారు యీ చేనేతవారి అభివృద్ధికి చేస్తున్నదేమిటో d:finite గా చెప్పమని, నేను సూటిగా ప్రశ్నిస్తున్నాను. అందుచేత, "ఈ ఖాదీనూలు అంతా అక్కరలేదు. ఈ ప్రభుత్వం డబ్బంతా వృథాగా ఖర్చుచేస్తున్నది," అని వారు చెప్పడము చాల హాస్యాస్పదము. ఈనాడుకూడా పలుమంది చేనేతవారు గ్రామ

గ్రామాలలో మిల్లునూలుకు బదులు ఖాదీనూలే యెక్కువగా కావాలంటున్నారు. ఈవిషయము ప్రతిపక్షంవారు తెలుసుకోవలెనని, నేను చెప్తున్నాను. ఈమిల్లునూలును తగ్గించి, ప్రతిగ్రామంలోను యెక్కువగా ఖాదీనూలు supply చేసిన, చేనేతవారికి యిబ్బందులు, కడగండ్లు, దుస్థితి తొలగుతవని, వారి యిబ్బందులు తీరుతవని చేనేత పారిశ్రామికులు చెప్తూంటే, ఆ విషయాలను మరచిపోవద్దని శ్రీ వెంకటేశ్వర్లుగారికి నేను చెప్తున్నాను. ఈ ఖాదీ డెవలప్మెంటు విషయంలో ప్రభుత్వము తీసుకొన్న శ్రద్ధకు చర్యలకు, మనం వారికి మన అభినందనలు తెలుపవలసివుంది.

నీరుపారుదల సమస్యను తీసుకుంటేకూడా, అనేకమైన పెద్దపెద్ద ప్రాజెక్టులను పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి మన ప్రభుత్వం తగు చర్యలను తీసుకొంటున్నది. వారు యీ సంవత్సరమే వాటిని అమలు జరుప ప్రయత్నిస్తున్నారు. అందులకువారికి నాఅభినందనలు. శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లుగా, గ్రామాలలోవుండే minor irrigation schemes విషయంలోను tank restoration schemes విషయంలో ప్రభుత్వము అశ్రద్ధచూపిస్తున్నదని, నేనుకూడా వారితో యేకీభవిస్తూ ఆ విషయాన్ని మరొకసారి చెప్పకతప్పదు. గ్రామాలలో అనేక చెరువులు repair కావలసివున్నవి. దానికి యీ budget లో కేటాయించబడిన డబ్బుచాల తక్కువవన్నీ, ఆ పద్దుక్రింద మరికొంత డబ్బును కేటాయించి, వాటన్నిటికీ మరమ్మత్తులు పూర్తిచేయించాలనీ ప్రభుత్వము వారిని నేను కోరుతున్నాను.

అలాగే electricity schemes విషయంలో ఇప్పుడు వేసిన పథకం కొన్నిప్రాంతాలకు అట్టే లాభదాయకంగా కనిపించడం లేదు. ప్రక్కనవున్న మార్కాపురం, కనిగిరి, దర్శి ప్రాంతాలకుకూడ ఉపయోగపడేందుకు వీలుగా ఆ ప్రాంతాలకు hydro-electric schemes ద్వారాగాని, డీసెల్ ఇంజనులు ద్వారాగాని electricityని సప్లై చేయాలని, ఏ పెద్ద ప్రాజెక్టు సహాయపడనట్టి ఈ ప్రాంతాలకు తప్పకుండా ఈ పవర్ సప్లై చేయుడానికి ఒక ప్రణాళికను వేస్తారని నేను ఆశిస్తున్నాను. రోడ్లవిషయంలో కూడా మరింతశ్రద్ధ తీసుక్కోవలసివుందని మనవిచేస్తున్నాను. గుత్తి,—కర్నూలు రోడ్డుకు, నంద్యాల,—కర్నూలు

Sri P. Ranga Reddi] [9th March 1954

రోడ్లకు ఒంగోలు రోడ్డుకు black topping చేయడానికి ప్రభుత్వం పూను కోవాలని కోరుతున్నారు. ఇంతకంటె గ్రామాల్లో వున్నటువంటి రోడ్లను కూడా పూర్తిచేయడానికి పూనుకుంటే, ఈ పెద్దరోడ్లను ఆపినాకాని, ఫరవాలేదని చెపుతున్నారు. ఈనాడు కొన్నిలక్షల రూపాయలు యీ సిమ్మెంట్ రోడ్లకు ఖర్చుపెట్టేకంటె గ్రామాల్లో ఉన్నటువంటి చిన్న చిన్న రోడ్లకు ఖర్చుపెట్టడం మంచిది. ఏమైనప్పటికి ఈరోజున ఇక్కడ ఆర్థిక మంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జెట్ చాలా బాగుంది. ఈ చెప్పిన విషయా లన్నీ వారు ఆచరణలో పెడతారని ఆశిస్తున్నాను.

The House then adjourned for lunch.
(After lunch: 2 P. M.)
(Mr. Speaker in the Chair)

* Sri K. GOVINDA RAO :—అధ్యక్షా ! మిగతామంత్రులు ఎవరూలేరు. అనేక ముఖ్య విషయాలున్న సందర్భంలో బడ్జెటుచర్చ జరుగుతున్నప్పుడు మంత్రులు, ముఖ్యమంత్రిగారు ఆర్థిక మంత్రిగారు తప్ప, ఎవరూలేరు.

The Hon. Sri T. VISWANATHAM :— మంత్రులు ఎవరూలేరని చెప్పడం అలవాటుకొద్ది చెపుతున్నారు. కాని, ముఖ్య మంత్రిగారు ఉన్నారు, బడ్జెటుకు reply ఇవ్వవలసిన నేను వున్నాను.

* Sri K. GOVINDA RAO — అధ్యక్షా! క్రిందటిసారి interim budget ప్రవేశపెట్టినప్పుడు, ఆర్థికమంత్రి విశ్వనాథంగారు ఏదో తొందరగా ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భములో ఈ బడ్జెటు ప్రవేశపెడుతున్నాము. రేపు రాబోయే బడ్జెట్ అసలైన బడ్జెట్ అనీ, అప్పుడు మా విధానాలన్నీ అందులో పొందుపరచుకుంటాం, అనిచెప్పారు. దానిమీద ఆంధ్రప్రజలందరు కూడా ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ప్రథమ బడ్జెట్‌లో తమ అభివృద్ధికి, ఆంధ్రదేశ అభివృద్ధికి అనువైన ప్రణాళికలు అందులో వుంటాయని ఆశించారు. ఈ ప్రసంగం చూచి నప్పుడు ఒక rosy picture కన్పిస్తున్నది. ఒకవైపున పంచవర్షప్రణాళిక క్రింద స్కీములు కనిపిస్తున్నాయి. రెండవవైపున బంజరుభూములను గురించి చెప్పారు. ఈ బంజరుభూముల గురించి లెక్కలుకూడా సేకరించ బడుతున్నాయని రంగారెడ్డిగారు చెప్పారు. అలాగే land tenures

Sri K. Govinda Rao] [9th March 1954

కాని ఆ ప్రేమ ఆచరణలో ఏమైనా కనిపిస్తుందేమోనని చూచాను. ఒక్క విషయంలోకూడా కన్పించలేదు. కాని, రాజాజీ గవర్నమెంటులో రావణాపల్లె రిజర్వాయరు స్కీముకు శాంక్షన్ చేసిన 5 వేల రూపాయలు ఇందులో కన్పిస్తున్నది. విశాఖపట్నంపై ప్రేమంతా ఏమైంది? ఏ రాజకీయ కారణంవల్ల చేశారో తెలియకుండా వుంది. వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిచేస్తాం-అనిచెప్పినవారు ఆచరణలో ఏమిచేశారని అడుగుతున్నాను.

కమ్యూనిటీ డెవలెప్‌మెంటు ప్రాజెక్టులు శ్రీకాకుళం జిల్లాలో ఒకటి, వాయల్పాడు తాలూకాలో ఒకటి పెట్టారు. ప్రభుత్వం ఏ పని చేసినా ఏదో ఒకవిధమైన రాజకీయాలు కనిపిస్తున్నాయి. ఈ మధ్యనే శ్రీకాకుళం జిల్లాలో శ్రీ నీలాద్రిరావు రెడ్డిగారి constituency లో ఒకటి గౌ॥ మంత్రి తిమ్మారెడ్డిగారి constituency లో ఒకటి, ఈ రెండు ప్రాజెక్టులు ఈ సంవత్సరం తీసుకున్నారు. ఇంతవరకు ఒక్కస్కీముకూడా విశాఖపట్టణం జిల్లాలో అమలుపర్చలేదు. ఇదంతా రాజకీయపక్షపాత దృష్టితో జరుగుతోంది. ఆమధ్య గౌ॥ ఉపముఖ్యమంత్రిగారు మాజిల్లా వచ్చినప్పుడు famine areas కు సహాయం చెయ్యడానికి Central Government 5 కోట్లు శాంక్షన్ చేసినట్లూ అందులోనుంచి మాజిల్లాకు, శ్రీకాకుళంజిల్లాకు కలిపి ఒక్క కోటిరూపాయలు యిస్తామనిచెప్పారు. కాని ఇంతవరకు, విశాఖపట్నం జిల్లాకు సంబంధించినంతవరకు, వీరు చేయబోయే స్కీములు ఒక్కటికూడా బడ్జెటులో కనిపించడంలేదు. 1 కోటి కాదుగదా 10, లేక 20 లక్షల రూపాయలైనా యిస్తున్నారా అంటే అదీ కనిపించదు.

దాదాపు 6 లక్షలు ఖర్చుపెట్టి 1200 యకరాలు సాగయే అవకాశంవున్న ఒకేఒక గంభీరగడ్డ అనే ప్రాజెక్టును అంగీకరించారు. మాకు కావాలని అడగకుండానే హైకోర్టు యిస్తామనిచెప్పిన ప్రభుత్వం, మాకు కావాలని కోరిన అభివృద్ధిప్రణాళికల కొక్కదానికికూడా ఏమీ డబ్బుయివ్వడంలేదు. మా జిల్లాలో ప్రాజెక్టుల నిర్మాణానికి 1 కోటిరూపాయలిస్తే క్షామాలు తగ్గిపోతాయని, విశాఖపట్టణం జిల్లానుంచివచ్చిన ఆర్థికమంత్రిగారికి మనవిచేస్తున్నాను. ఒక కోటిరూపాయలు యివ్వాలంటే పెద్ద సమస్యకాదు. Prohibition ను

9th March 1954] [Sri K. Govinda Rao

యెత్తివేసి, ఆమాత్రం డబ్బు మాకు సహాయంచేస్తే 10, 12 మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులు మేము నిర్మించుకోగలము.

Sarada river system క్రిందవున్న కాలువలద్వారా 10,000 యెకరాల భూమి సాగవుతోంది. కాని దాని ఆనకట్టలు శిథిలమై పోయాయి. వాటి maintenance విషయమై P. W. D. కి hand over చేశారు. కాని సదరు ఆనకట్టల రిపేరింగ్ విషయంలో మేము Executive Engineer ను అడిగితే మాకు extra staff యిస్తేనే గాని చేయలేమంటున్నారు. ఆ పని వెంటనే చెయ్యకపోతే రైతులకు నీళ్లులేకుండా పోతాయి.

చెరువుల మరమ్మత్తుక్రింద రాష్ట్రంలో 8 లక్షలు మంజూరు చేశారు. కాని ప్రత్యేకంగా విశాఖపట్టణం జిల్లాలో వున్న చెరువుల మరమ్మత్తుకు ఎంతడబ్బు మంజూరుచేశారో బడ్జెటులో కనిపించడంలేదు.

Electricity స్కీములకు 5 కోట్ల రూపాయలు శాంక్షన్ చేసినట్లు బడ్జెటులో కనిపిస్తోంది. అందులో 3 కోట్లు మాచ్ ఖండుకు యిచ్చారు. సంతోషమే. కాని ఆచరణలో చూస్తే దీంట్లో చాలా లోపాలు కనిపిస్తున్నాయి. ఇది డిపార్టుమెంటల్ గా చెయ్యకుండా కంట్రాక్టర్లద్వారా చేయించడమువల్ల efficiency తగ్గిపోయి schedule రేట్లకంటె నూటికి15వంతులుఎక్కువఖర్చు పెట్టవలసివస్తుంది. ఇంతేకాకుండా 2000 మంది కార్మికులు కొద్దిరోజుల్లో నిరుద్యోగులై పోతున్నారు. Gannon Dunkerly కంపెనీవారు కట్టిన flume channel ఒకటి crack యిచ్చి డబ్బంతా వృథాఅయిపోయింది. Departmental గా చేస్తే efficient గా వుంటుంది. ప్రాజెక్టులు కట్టడంలో కూడా ఆలోచనలేకుండా చేస్తున్నారు. రాజమండ్రినుంచి "గుణదల" వరకు 20 లక్షలు ఖర్చుపెట్టి electric line వేస్తే లెవెల్ సరిగాలేదని, తప్పుగా జరిగిందని తిరిగి 2 లక్షలు అదనంగా ఖర్చు చేసి పాతలైను పీకిపారవేయించారు. ఇటువంటి అనవసరపు దుబారా ఖర్చులు అవుతూవుంటే ప్రభుత్వం ఏమిచేస్తోంది. ఈ దుబారాఖర్చులు ఎందుకు జరుగుతున్నాయో విచారించాలి. అందుకనే దీనిని ప్రజలు "పప్పుపులుసు డిపార్టుమెంటులెండి" అంటున్నారు. ఈ విషయంలో ప్రభుత్వం జాగ్రత్త వహించవలసినదిగా కోరుతున్నాను.

[ 9th March 1954

* Sri G. NAGABHUSHANAM:—Mr. Speaker, all the points raised by my hon. Friend Mr. P. Venkateswarlu has come to this, namely, speed, efficiency and that the moneys spent for Government servants and for Governor should be reduced and used for public good. In answer to the questions, I want to read a statement made by the Hon. Sri V. V. Giri recently to show to what extent the Andhra Ministers have taken steps to contribute for the common good by foregoing some of their comforts and convenience.

"The infant State of Andhra has made a good beginning in setting up good traditions and its Ministers have set up an ideal example by staying in unostentatious buildings which is a study in simplicity."

Referring to the zeal and enthusiasm with which the Secretariat staff is working, Mr. Giri remarked.

"I must congratulate the staff of the Secretariat." (Laughter) These are the observations made by the Hon. Sri V. V. Giri and hon. Members may laugh, but I may tell them that they have no parlimentary experience and they have come to the Assembly for the first time. Therefore I ignore their laughter, because, as I said, they lack parliamentary practice procedure, courtesy and all that.

Sri PILLALAMARRI VENKATESWARLU :— Mr. Speaker, on a point of order.

గౌరవసభ్యులుమాట్లాడుతూ యితర సభ్యులునవ్వుతున్నారనీ,అందువల్ల వారికి పార్లమెంటరీ experience, tradition తెలియవని, courtesy తెలియదని సభ్యులమీద aspersions ను pass చేస్తున్నారు. ఇది వరలోకూడా వారి కనేకసార్లు చెప్పడం జరిగింది, ఇంకా అదేవిధంగా చేస్తే మావైపునుంచికూడా అనవలసి వస్తుంది. వారు భరించలేరు. కాబట్టి సభ్యులహక్కులకు మీరు రక్షణ ఇవ్వాలి, వారికే పార్లమెంటరీ practice బాగా తెలుసుననీ, మాకు తెలియదనీ అనుకొంటున్నారు.

9th March 1954] [Sri Pillalamarri Venkateswarlu

ఇతరులను గురించి ఎటువంటి భాష ఉపయోగించాలో పాపం వారి బుర్రకు తట్టినట్టులేదు.

Sri G. NAGABHUSHANAM:— I must congratulate Mr. Venkateswarlu because he is at liberty to speak as he likes. No parliamentary procedure affects my friend.

Sri K. RAJAGOPALA RAO:-బుర్రలు అన్నది unparliamentary పదమని నాగభూషణంగా రంటున్నారు. ఈ పదం mind అనే అర్థంలో వాడబడింది. మీరు ruling యివ్వకపోతే అది రికార్డులో వుండిపోతుంది. అదికూడా ఉపయోగించకూడదంటే చాలాకష్టం.

Sri G. NAGABHUSHANAM:- I know Telugu very well and I can speak better chaste Telugu. But as I am accustomed to speak in English, I am speaking in English.

Sir, the problem of weavers is before the country for the last two years. Excepting the suggestion made by Sri C. Rajagopalachariar that the problem of weavers can only be solved by reserving for the weavers the manufacture of dhotis and coloured saris, there is no other practical suggestion in India today. Democracy likes criticism and democracy stands on criticism. We are democrats and we welcome criticism, but mere criticism without constructive suggestions is of no use. Criticism must be constructive and practical to enable the Government to take practical steps in that direction. Criticism for critism's sake is absolutely futile. Of course, Government have done much for the handloom weavers and I don't deny it. They have sanctioned Rs. 20.0 lakhs as loan to help the weaver. But so far, I see that money has not reached the weavers. I am coming from Rayadrug constituency, a very big weaving centre with a population of about 10,000 weavers. In Rayadrug taluk there are larger number of weavers than in any other taluk. There is also a big powerloom factory with 100 power looms where silk saris, upper cloths, etc. are manufactured.

Sri G. Nagabhushanam ] [ 9th March 1954

Further, in Rayadrug taluk the weavers are supplied yarn from Anantapur which is nearly 62 miles by bus and 107 miles by rail. Hitherto they were getting yarn from Bellary. There-fore the Government should consider in what way the weavers living in Rayadrug should be benefited. I have already submitted a memorandum to the Government to permit the weavers of Rayadrug to purchase yarn from Bellary or to make such other arrangements as are necessary to purchase yarn from other areas at a cheap rate.

Then, the people manning the co-operative department and the co-operative societies, in my humble opinion, are trained in British Raj, for a Police State In my humble opinion, they are not fit to carry on the duties imposed on them in the present set-up of a Welfare State. Welfare State requires enthusiasm, zeal and push to do good to the people. The public servants who are employed at present in co-operative societies, in my humble opinion, are not showing these qualities essential to realize the objective, viz. conferring happiness on our weavers. They have not done much in solving the problem of unemployment of weavers. Therefore I would request the Government to take immediate steps to see that the relief scheme that is announced by the Government is put into force at once. I would also request that a show-room may be opened at Rayadrug where the weavers have been manufacturing, silk cloth with embroidery, lace and several other artistic works, besides cotton cloth. So it is fit and proper that a show-room exhibiting the above products is opened there. As unemployment amongst weavers is growing, I request the Government to implement the relief scheme immediately.

I congratulate, the Government on having set apart Rs. 5·0 crores for the development of electricity. The Hon. Finance Minister Sri T. Viswanatham, in his

budget speech, said that priority should be given for the extension of electricity to rural areas. I congratulate the Ministry. Rural areas should be supplied with electricity because it helps directly the Grow More Food Campaign. In Mysore State, electricity is extended to the villages not for decorating the village with lights, but for producing more food, i.e., for well-irrigation. Our State also can follow that example because our supply of electric energy is small and we have to borrow every time from Mysore State. In 1951 Rayadrug town was supplied with electricity and we could not make proper use of it due to handicaps and could extend only to one village. Therefore, I would request the Government to see that electricity is extended to all the villages, at least within 10 miles round Rayadrug town, so that people may use electricity for growing more food.

Regarding the Bhairavanithippa project, I have to say a few words. The foundation stone was laid as far back as 1951 by the then Revenue Minister, Sri Sitarama Reddi. Even in this budget only Rs. 5·0 lakhs is shown as the amount allotted. It is mere paper allotment. But I take the assurance of the Hon. Sri T. Viswanatham that the matter would be taken up immediately and I hope that all the differences between the Mysore Government and this State will be settled and the project will be taken up shortly. I hope also that the Hon. Sri T. Viswanatham will pursue these negotiations with Mysore State and see that the project becomes a *fait accompli*.

After the formation of the Andhra State, Rayadrug has come within the jurisdiction of Anantapur district. The people of Rayadrug taluk are feeling it very defficult to go to Ananthapur because there are no direct roads, particularly from the villages. Some roads that were laid last year as famine work have to be

Sri G. Nagabhushanam] [9th March 1954

improved considerly. I would request the Government to take up road works so that the villagers can go to the district headquarters at least by bus. If these small roads are metalled, instead of being neglected they would become our national asset and would also facilitate the villagers to go to the district headquarters. Thank you Sir.

Sri G. C. KONDAYYA:— అధ్యక్షా! మొట్టమొదటిసారి ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత సంపూర్ణమైన బడ్జెట్ ఈరోజున మన ముందు ప్రవేశపెట్టబడింది. ఆంధ్రప్రజలు, ఆంధ్రరాష్ట్రంవస్తే తమకష్టాలు పరిష్కారం కాగలవని ఆశించారు. కాని వారు ఆశించినట్లుగా ఏమీ జరగడం లేదు. మనకు రాష్ట్రం వచ్చేముందు, ప్రజలు ఎలాంటి కష్టముల ననుభవించేవారో మనకు రాష్ట్రం వచ్చినతరువాత ఈనాడుకూడా ఆ కష్టములనే అనుభవిస్తున్నారు. ఆంధ్రప్రజలు, తమ కష్టములను ఈ నూతన ఆంధ్రప్రభుత్వం తొలగించుటకుగాను ప్రయత్నిస్తారని ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. కాని ఈవేళ మనముందు ప్రవేశపెట్టిన బడ్జెట్‌ను పరిశీలించి చూచినట్లయితే మన ప్రజల కష్టాలను పరిష్కరించడానికిగాని, వారు ఆ కష్టములనుండి తొలగడానికిగాని ఎంతమాత్రం తోడ్పడేదిగా లేదు, ఈబడ్జెట్ మన ఆంధ్రప్రజల ఆశయాలను నెరవేర్చలేదు, అని నేను అభిప్రాయపడుతున్నాను. ముఖ్యంగా మన ఆంధ్రదేశంలో గత 5, 6 సంవత్సరములుగా అనేక క్రొత్తసమస్యలు ఉత్పన్నమవడం, అవి అల్లాగే పరిష్కారం కాకుండా ఉండడం జరుగుతోంది. అందువల్ల ప్రజలు చాలా కష్టములను, చాలా చిక్కు సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. ప్రస్తుతం మన ఆంధ్రదేశంలోని ప్రజలుచాలా కష్టముల ననుభవిస్తున్నారు. కష్టములను తొలగించడానికి ప్రయత్నిస్తున్నట్లు ప్రభుత్వం ఈ బడ్జెట్‌లో సూచించలేదు. ముఖ్యంగా వ్యవసాయకూలీలు, పేదరైతులు, పేదప్రజలు ఈ హరిజనులు అనేక కష్టముల ననుభవిస్తున్నారు. అదేవిధంగా చేనేత పారిశ్రామికులుకూడా అనేక కష్టముల ననుభవిస్తున్నారు. వారు మన ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత వారికి అన్ని సౌకర్యములు లభించనున్నాయని ఎన్నో ఆశలు పెట్టుకుని ఉన్నారు కాని ఇప్పుడు

9th March 1954] [Sri G. C. Kondayya

వారి ఆశలన్నీ నిరాశలై పోయాయి. వారిలో చాలామందికి కడుపు లేక నిరుద్యోగులై పోవటం సంభవిస్తోంది. వారికోసమై గంజికేంద్రములను నెలకొల్పినంతమాత్రమున వారికున్న కష్టములన్నీ తీరవు అని మనవిచేస్తున్నాను వారి ఆర్థిక పరిస్థితిని పెంచేటందుకు, వారికి పని కల్పించేందుకు ప్రభుత్వం తగు కృషిచేయాలి. ఈ చేనేత పారిశ్రామికుల విషయంలో ప్రభుత్వం చెప్పుకోదగినంతగా ఏమీ వారికి సౌకర్యములు కల్పించలేదని, నేను అభిప్రాయపడుతున్నాను. తరువాత బంజరు భూముల పంపకం సమస్య చాలా కాలంనుంచి పరిష్కరింపబడకుండా ఉన్నది, దానిని గురించి ఇంతవరకు ప్రభుత్వంవారు ఆలోచించిక పోవడం చాలా విచారకరమైన విషయం. ఈ బంజరుభూములను పంచినంత మాత్రమున ఈ బడ్జెటులో లోటువస్తుందని నాకు నమ్మకంలేదు అలాంటప్పుడు ఈ బంజరు భూముల పంపకం సమస్యను పరిష్కరించడానికి ఎందుకు మన ప్రభుత్వం పూనుకోలేదు. అని అడుగుతున్నాను. బంజరు భూముల పంపకం సమస్యను పరిష్కరించుటకు మనముందు ఉంచిన బడ్జెట్‌లో ఏమాత్రం సూచించనందుకు చాలా విచారిస్తున్నాను ఈ బంజరుభూముల పంపకం విషయము మొన్న non-offical రోజున చర్చించినప్పుడు, ఈ సమస్యాపరిష్కారమునకు ఒక సంవత్సరం కాలం అవసరమని ప్రభుత్వం వారన్నారు. ఈ సమస్యనుపరిష్కరించడానికి ఒక expert ను కూడా వేస్తామన్నారు. అసలు ఈ బంజరు భూములసమస్యను పరిష్కరించడానికి సంవత్సరం రోజులు పడుతుందని నేను అనుకోను. ఇప్పుడు బంజరు భూములు 4 లక్షల ఎకరములు భూస్వాములక్రింద, 23 లక్షలు ఎకరాలు ఎస్టేట్లలోను, జమీందారులవద్ద, కొన్ని లక్షల ఎకరములు assignment కాకుండానే దురాక్రమణక్రింద ఉన్నాయి. ఈ బంజరు భూములను జమీందారుల దగ్గరనుంచి, భూస్వాముల దగ్గరనుంచి స్వాధీనంచేసుకొని వాటిని బీదలకు, వ్యవసాయ కూలీలకు, హరిజనులకు పంచిపెట్టడానికి సంవత్సరంకాలం ఎందుకు అవసరమో నాకు అర్థంకావడంలేదు. ఈ బంజరుభూముల సమస్యను పరిష్కరించినంత మాత్రాన బడ్జెట్‌లో లోటురాదుకదా; అలాంటప్పుడుదీనిని పరిష్కరించుటకు ఈ సంవత్సరమే ప్రభుత్వం ఎందుకు పూనుకోకూడదు? మనం అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉన్నపుడు కౌలుదారుల సమస్యను పరిష్కరించే సందర్భంలో తంజావూర్ ordinance ప్రవేశపెట్టినట్లు ఈ

Sri G. C. Kondayya] [9th March 1954

బంజరు భూముల విషయంలోకూడా ఒక ordinance ను చేయాలని నేను కోరుతున్నాను. మన ఆంధ్రప్రభుత్వం కౌలుదారుల సమస్య విషయంలో చేస్తున్న ప్రకటనలను, ఇక్కడ మనంచేస్తున్న ఉపన్యాసాలను ఆధారంగా చేసుకొని భూస్వాములు కౌలుదార్లను భూములనుండి వెళ్ళగొట్టడం, భూములనుంచి తొలగమని నిర్బంధం చేయడం జరుగుతున్నది. ఈ కౌలుదారుల సమస్యను పరిష్కరించడానికి మన ప్రభుత్వం వెంటనే చర్యలుతీసుకొని ఒక ordinance ను pass చేయవలయును. ఈకౌలుదారులను భూస్వాములు తొలగించడంవల్ల వారికి చాలా యిబ్బందిగా ఉన్నది. చాలా కష్టపడుతున్నారు. అందుచేత ఈకౌలుదార్ల రక్షణకుగాను మన ప్రభుత్వం ఒక ordinance ను pass చేయవలసి ఉంటుంది. ఈ కౌలుదార్ల సమస్యను పరిష్కరించడానికికూడా ఈబడ్జెట్‌లో సూచించలేదు. మొట్టమొదట కౌలుదారులకు రక్షణ కల్పించడానికి ప్రభుత్వం వెంటనే ఒక ordinance ను ఒకదానిని ప్రవేశపెట్టవలయును. తరువాత క్రమంగా కౌలుదారుల రక్షణకు ఒక చట్టమునుకూడా ప్రవేశపెట్టవలయును. కౌలుదారుల విషయం, బంజరు భూముల విషయం ఈ రెండూ ప్రధానమైన సమస్యలుగా ఉన్నాయి. ఈ విషయముల గురించి యిప్పటికైనా ప్రభుత్వంవారు ఆలోచించుచున్నందుకు సంతోషమే. వీటి పరిష్కారమునకై ఒక expert ను నియమించుచున్నామని అన్నారు. ఈ సమస్యల పరిష్కారమునకు ఇప్పటికైనా మన ప్రభుత్వం పూనుకొంటున్నందుకు సంతోషమే, కాని దానిని వీరుపూర్తిగా వెంటనే పరిష్కరించుతారనే నమ్మకంమాత్రం నాకు లేదు. ఈ రెండు సమస్యలు చాలా ప్రధానమైనవంటివి కనుక వీటిని వెంటనే పరిష్కరించవలసియుంటుందని ఈ మంత్రివర్గానికి నేను విజ్ఞప్తిచేస్తున్నాను. విద్యుచ్ఛక్తి, నీటిపారుదల ప్రాజెక్టుల విషయంలో మన ప్రభుత్వం కొంచెం శ్రద్ధతీసుకుంటున్నమాట వాస్తవమే. కాని ఆ పనులను వెంటనే పూర్తిచేస్తారా? అనే నమ్మకంలేదు. మొన్న ముఖ్యమంత్రిగారు క్రిష్ణా రోడ్ రెగ్యులేటర్ బ్రిడ్జికి శంకుస్థాపన చేశారు. సంతోషించదగ్గ విషయమే. కాని వెంటనే పని ప్రారంభించి దానిని పూర్తిచేస్తారనే నమ్మకం నాకు లేదు. ఈ క్రిష్ణా రోడ్ రెగ్యులేటర్ బ్రిడ్జి విషయమై Planning Commission ఆమోదమును పొందకుండానే మొదలుపెట్టడమైనది అన్నారు. అది అత్యావసరమగుటవలన దానిని ముందుగనే మొదలుపెట్టి తరువాత

9th March 1954] [Sri G. C. Kondayya

ప్లానింగ్ కమిషన్ వారియొక్క ఆమోదముకొరకై పంపాము అని ప్రభుత్వం అంటున్నారు. పెద్దపెద్ద ప్రాజెక్టులను కట్టుటకు యిప్పుడు ప్రభుత్వం తల పెట్టారు. ఈ ప్రాజెక్టులను చాలా ఎక్కువడబ్బు వ్యయంచేసి కట్టటం, వాటికి చాలా కాలం పట్టడం జరుగుతుంది. పెద్దపెద్ద ప్రాజెక్టులను కట్టుటకు అధమపక్షం 10 ఏళ్లు పడుతుంది. ఇటువంటి ప్రాజెక్టులను కట్టుటకు మన ప్రభుత్వం వారు ప్లానింగ్ కమిషన్‌యొక్క ఆమోదమును పొంది తరువాత వారిచ్చిన రిపోర్టును అంగీకరించవలసివుంది. తరువాత ఆ ప్రాజెక్టు విషయమై 7 కోట్లో, 8 కోట్లో ఖర్చు అవుతుందని ఇండియా గవర్నమెంటును అడిగితే, 7, 8 కోట్లుకాదు 5 కోట్లు యిస్తామని వారు చెప్పడం జరుగుతోంది. ఇంక ఆ పెద్దప్రాజెక్టులు పూర్తిఅవడానికి 10 ఏళ్ళకాలం తక్కువపట్టదు. 10 ఏళ్లు పూర్తి అయ్యేసరికి ప్రాజెక్టులో ఇది వరకు కట్టినభాగం శిధిలమైపోవడం జరుగుతుంది. పోతాయని చెప్పక తప్పదు. అందువల్ల ప్రభుత్వం పెద్దపెద్ద స్కీములుకాక చిన్నచిన్న స్కీములను ఏర్పాటుచేసి త్వరగా పనులు ప్రారంభించి పూర్తిచేయుటకు పూనుకోనవలయును. ఇక చెరువులసంగతి తీసుకుంటాను. చెరువుల repair లకుగాను ప్రభుత్వం 5 లక్షల రూపాయలను కేటాయించారు. అసలే 4 సంవత్సరముల నుంచి repairs లేని చెరువులు చాలా ఉన్నాయి. చెరువులు repair కు 5 లక్షలు చాలదు. చెరువుల విషయంలోను, చిన్నచిన్న వ్యవసాయపు పనులకు చేయడం విషయమై ప్రభుత్వం బడ్జెట్‌లో ఏమి సూచించలేదని నేను అభిప్రాయపడుతున్నాను

ఇక electricity గురించి మనవిచేస్తాను, నెల్లూరు థర్మల్ స్టేషన్‌ను అవిభక్త మద్రాస్ గవర్నమెంట్ కట్టించారు. తరువాత దానిని అభివృద్ధి పరచే ఆలోచనే ఆ ప్రభుత్వానికి లేకపోయింది. దానివిషయమై ఈ బడ్జెటులో కనపరచడం చాలా సంతోషించ దగ్గవిషయమే. కాని దానిని ఎంతవరకు చేయగలరు అనేది నాకు అనుమానము. ఈ thermal station, మిగతా electricity schemes, అన్నీ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడ్డాయి అన్నారు. ఈనెల్లూరు thermal station లో ఉత్పత్తయ్యేవిద్యుచ్ఛక్తి ఇరిగేషన్ కొరకై అచ్చటి రైతులకు చాలా అవసరము. దానిలో ఉత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తి చాలాతక్కువ. ఆ stationలో ఇంకా ఎక్కువ electricity ఉత్పత్తి చేయుటకు ప్రభుత్వం తలపెట్టినది. అందుకు చాలా సంతోషించ వలసినదే.

ఇక community projects, national development schemes విషయంలో మన రాష్ట్రంలో చాలా తక్కువ బ్లాకులు చేర్చబడినాయి. పంచవర్ష ప్రణాళిక, community projects, national development schemes క్రింద ఇంకా స్కీములను చేర్చుటకు, వాటిని రాష్ట్రం అంతటా విస్తరింప చేయటానికి ఎటువంటి ప్రయత్నములు జరగవని నేను అభిప్రాయ పడుతున్నాను.

ఈవేళ కమ్యూనిటీ ప్రాజెక్టులని, నేషనల్ డెవలప్‌మెంటు స్కీము క్రింద కొన్ని బ్లాక్సు వేసారు. కొంత మంది మంత్రులు చేసిన ఉపన్యాసాల వల్ల తప్పకుండా వోట్లు ఇచ్చి తమ ప్రభుత్వాన్ని బలపరచే వారికి మాత్రమే ఇవన్నీ grant చేశారనే అభిప్రాయం ప్రజలలో కలిగింది. ఇది కేవలం opposition లో వున్న వారు ఏదో చెబుతున్నారంటే లాభం లేదు. బడ్జెటు తీసుకున్నపుడు వెనుకబడ్డ ప్రాంతాలు ఏవి, శిధిలావస్థలో వున్న చెరువులుఏవి, ఉత్పత్తికి అడ్డం కలిగించే విషయాలు ఏవి, అన్నవి దృష్టిలో వుంచుకోవాలేగాని మాకు వోట్లు ఎవరు ఇచ్చారు, ఎవరు ఇవ్వలేదు అనే విషయం అర్థంలేని సంగతి అని అభిప్రాయ పడుతున్నాను. ప్రజలు ఎవరినో ఒకరిని ఎన్నుకొని పంపించిన తరువాత రాష్ట్ర వ్యాపితమైన దృక్పదంతో సమస్యలను పరిష్కరించాలి తప్ప పార్టీకమైన దృక్పధంతో బడ్జెటు సమస్యలను పరిశీలిస్తే బడ్జెటు proposals అమలు జరుపడం సాధ్యం కాదని, ఆంధ్రులలో అనైక్యతకు ఇది దారితీస్తుందని అభిప్రాయ పడుతున్నాను. లోటును పూడ్చడం కోసము కొన్ని సూచనలు చేసారు. ఖర్చులను చూస్తే 20 కోట్ల రూపాయిలు పరిపాలనా నిర్వహణకు అవుతున్నట్లు కనిపిస్తోంది. ఇది top heavy administrationఅని అందరమూ అంటున్నాం. నేను చెప్పేది, ఉద్యోగులను తీసివెయ్యాలని కాదు. వారి జీతాలను సవరించవచ్చును. ప్రభుత్వం కొంత attention కనబరిస్తే వాటిని సవరించ వచ్చును. అసాధ్యం ఏమీకాదు. ఎస్టిమేట్లు తయారు చేసిన తరువాత assesment 20 వంతులు వుంటేగాని వీలుకాదనే కారణంతో ఎస్టిమేట్లు రద్దుచేస్తారు. ఇటువంటి G.O. లను scrap చేయాలి. ఈ నియమం వుంటే కొన్ని పనులు అసలు సాధ్యమేకావు. దీనికి డబ్బు అడ్డం రాదు. బంజరు భూముల విషయంలో మూడు సంవత్సరాల నుంచి pending గా వున్న కేసులువున్నాయి. 5 ఎకరాలు మించిఉన్న వారికి బంజరులు ఇవ్వకూడదని వున్నా వందల ఎకరాలు వున్నవాళ్లు కూడా

బంజరులు సాగు చేస్తున్నారు. ఇక హాస్యమెందుకో, అప్పీలెందుకో అర్థంకావడం లేదు. వీటిని అమలు జరుపుతూ, బంజరుభూములు పంపకం జరుపడానికి డబ్బు అక్కరలేదు. సక్రమంగా జరిగేట్లు చూడవచ్చు. ఒక రైతుగాని కూలీగాని పిటిషను పెడితే సంవత్సరంలోపుగా ఏమీ పరిష్కారం కాదు. ఈ విధమైన దాన్ని సంస్కరించ వలసిన అవసరం ఎంతైనా వున్నది. రెవెన్యూ డిపార్టుమెంటునుంచి 4, 5 నెలలలోపుగాను, Public Works Department లో technical విషయాలలో 6 నెలలలోను జవాబువచ్చేట్లు చూడవచ్చును.

ఇంక లంచగొండితనం గురించి విసిగి విసిగి వారే ఊరుకుంటున్నట్లువున్నది కాని సమస్య మాత్రం పరిష్కారం కావడం లేదు. అసలు G. O. లలోనే తప్పులువున్నాయి. వాటిని సంస్కరించాలనే ధోరణి లేక పోవడం దురదృష్టకరం అనుకుంటాను. ఈ బడ్జెటులో కొన్ని అదనపు పన్నులు వేశారు. Water tax ఎక్కువచేయడం; వాణిజ్య పంటలమీద ఎక్కువ పన్ను వేయడం; betterment tax వేయడం. మనకు వచ్చే ఆదాయంలో నూటికి 80 వంతులు రైతులనుంచే వస్తోంది. మళ్లీ ఇప్పుడు వేసే పన్నులు వాళ్ళమీదనే పడుతున్నాయి అని అనుకుంటున్నాను. నెల్లూరు జిల్లా తీసుకుంటే ఒక లక్షా 70 వేల ఎకరాలు డెల్టాగా సాగు చేస్తున్నట్లు వున్నా, సగానికి పైగా సాగు కాకుండానే వుంటోంది దానినికూడా డెల్టాగా తీసుకుని చెరువుల క్రింద వున్నదానిమీద కూడా పన్ను వేస్తే రు. 9, 10 లు శిస్తు వుండేది 12, 15 రూపాయిల వరకు పోతుంది. రైతాంగం ఇంత హెచ్చు పన్నులు భరించలేరని మనవి చేస్తున్నాను. పొగాకు విడుదలకాక కొన్ని కోట్ల రూపాయిలు విలువగలసరుకు నిలువవుండిపోయిందని వింటున్నాము. వేరు శనగ ధరలు కూడా పడి పోతున్నాయి. ఇటువంటి వాణిజ్య పంటల మీద ఇంకా హెచ్చు పన్నులు వేస్తే చిక్కులు రాగలవని అనుకుంటున్నాను. ఇంతకు దీనివల్లవచ్చే ఆదాయం ఒకకోటి వరకు మాత్రమే. మద్రాసు ఎసెంబ్లీలో betterment tax వచ్చినప్పుడు graded agricultural income tax వేస్తాము అన్నారు. భూమి తాహతునుబట్టి అయిదు ఎకరాల వరకు తొలగించి, భూమినుంచి వచ్చే ఆదాయాన్నిబట్టి పన్ను వేయవచ్చు. దీనివల్ల సమాజంలోవున్న ఆస్తిపరులనుంచి మాత్రమే tax వసూలు చేయడం జరుగుతుంది. అభివృద్ధి ప్రణాళికల

Sri G. C. Kondayya] [9th March 1954

కోసము అవసరమైన ఈ పన్నులు ఆస్తిపరుల మీద పడునట్లు చూసి పోగాను విషయంలో కేంద్ర ప్రభుత్వం నుంచి ఎక్కువ వాటా వచ్చేట్లా కృషి చేసారని అభిప్రాయ పడుతున్నాను.

Sri M. RAJESWARA RAO :—అధ్యక్షా, మనముందు వున్న బడ్జెటు—దీని ఫలితాలు ఏమైనా—ఒక నూతన వికాసము మాత్రం ఇందులో కనిపిస్తోంది. చాలా తరగతుల ప్రజలకు చాలా ఆశా జనకంగా కనిపిస్తోంది. దీనికి కారణం బహుశా చాలారోజులు ప్రతి పక్షంలో వున్న విశ్వనాథంగారు తయారుచేశిన బడ్జెటు అవడమే అనుకుంటాను. హరిజనులకుకాని భూమిలేని వారికిగాని ఇది చాలా ఆశాజనకంగా కనిపిస్తోంది. గవర్నమెంట్లును continue కానిస్తే దీనిని ఏవిధంగా అమలుపరుస్తారో చూడగలము. తరువాత పోయినసారి బడ్జెటులో మాట్లాడినప్పుడు కొన్ని సూచనలు ఇచ్చాను. దానికితగ్గట్టుగా ఇందులో కొన్ని సూచనలు వచ్చినందుకు ఈ సభవారికి కృతజ్ఞత తెలుపవలసిన అవసరం వున్నది. ముఖ్యంగా బడ్జెటు గురించి చర్చించేటప్పుడు దేశంలో వున్న పరిస్థితులు ఏవిధంగావున్నాయి, వాటిని తీర్చడానికి ఈ బడ్జెటు దోహదం కలుగ చేస్తోందా అనే విషయం పరిశీలించాలి. ముఖ్యంగా సమాజంలో తారతమ్యాలు ఎక్కువగా వుండడం చూస్తున్నాము. పోయినసారి విశ్వనాథంగారు, రామమూర్తిగారు డెమాక్రసీ సక్రమంగా నడవడానికి ఈ తారతమ్యాలు, inequalities తొలగించ వలసిన అవసరం గురించి చెప్పారు. దానికి అనుగుణంగా బడ్జెటులను రూపొందించాలి అనిచెప్పారు. దానికి ముఖ్యమైన విధానం taxation. Taxation ఏవిధంగా వేస్తే inequalities పోతాయి అనేది ప్రతి ఆర్థిక శాస్త్రవేత్త ఆలోచించ వలసివుంటుంది. ఇవి అన్నీ విశ్వనాథంగారు ఆలోచించారు అని అనుకుంటాను. దీన్ని మనం progressive taxation అంటున్నాము. Economists marginal utility, marginal income అని చెబుతుంటారు. ఏ tax వల్ల ఎంతవరకు ఆదాయం వస్తుందో గమనించి వేయాలి. అంతకుమించి వేస్తే income తగ్గుతుందికాని పెరుగదు. దీనికి ఒక్క ఉదాహరణ చెప్పాలంటే, మద్రాసు శాసన సభలో Motor vehicles passengers and goods Act వల్ల 40 %, motor vehicles మీద పన్ను పెంచడంవల్ల 20% బస్సులు సర్వీసులో నుంచి

9th March 1954] [Sri M. Rajeswara Rao

withdraw చేయబడ్డాయి; కోనుగోలు శక్తిలేక చాలా మంది stop చేసారు. అటువంటి tax regressive అన్నప్పుడు తగ్గించ డానికి ప్రయత్నం చేయాలి. ఈ Act చెల్లదు అని High Court చెప్పడం తెలుసును. కాబట్టి నేను మనవి చేసేది యేమిటంటే పన్నులు వేసే టప్పుడు ఆదాయము taxation regressive గా వున్నదా అన్న విష యాన్ని జాగ్రతగా ఆలోచించాలి. ఈరోజుల్లో agricultural labourer పరిస్థితి చాలా ఘోరంగా వున్నది. Weavers గురించి చాలా ప్రచారం జరుగుతోంది. వారిగురించి ప్రభుత్వం చాలాసహాయం చేస్తున్నది. ఈ నాడు agricultural labourers విషయంలో ప్రభుత్వం జాగ్రతవహిం చడం లేదు. Agricultural labourers కోట్లు వున్నారు. వారి పరిస్థితి చాలా ఘోరంగా వున్నది. చర్యలు తీసుకోడం లేదు. Minimum wages గురించి చాలా విన్నాంగాని ఈ సమస్య యింత వరకు పరిష్కారం కాలేదు. సరైనటువంటి propaganda సాగే అవ కాశం లేక పోయింది. దీనిని ప్రభుత్వ దృష్టికి తెస్తూ తగిన చర్య తీసుకోవాలని కోరుతున్నాను. వారిగురించి ప్రభుత్వం మరచిపోయి నట్లయితే దేశము చాలా ప్రమాదాలకు గురికావలసి వస్తుందని మనవి చేస్తున్నాను. "దున్నేవానిదే భూమి" అని చాలాకాలంనుంచి కేకలు వింటూవస్తున్నాం. గాని ఆచరణలో పెట్టబడలేదు. Land tenure విధా నంలో మార్పులు గురించి చాలాఆందోళన జరిగింది. కాని ఆంధ్ర ప్రభుత్వం వచ్చిన తరువాత దీనిగురించి చాలమంది సభ్యులు సూచిం చారు. కాని యింతవరకు అమలు పరచక పోవడం శోచనీయం. ఈ విషయం పరిశీలించాలని కోరుతున్నాను. Agrarian reform విష యంలో ఆచరణకన్న చాలవరకు ప్రచారం ఎక్కువగ జరుగుచున్నది. ఈ ప్రచారం చాల ప్రమాదకరం. The talk has done more harm than good. ఈ ప్రచారం చాల harm చేస్తున్నది. కాబట్టి మంత్రులు, ప్రభుత్వంవారు, బాధ్యతవున్నవారు యిలాంటి propaganda చాలించి రాజగోపాలాచారిగారు పెట్టిన ordinance వంటిది పెట్టి కార్యా చరణలో దీక్ష చూపించాలని మనవిచేస్తున్నాను. కౌలుదారుల విష యంలో expert committee వేస్తామని చెప్పారు. చాల కమిటీలు యిదివరకు వేయబడ్డాయి. సుబ్రహ్మణ్యం కమిటీ కొన్ని సూచనలు చేశారు. వాటి పరిశీలన యింకా జరగలేదు. ఈ ప్రభుత్వంవారు

Sri M. Rajeswara Rao] [9th March 1954

expert ను వేస్తున్నాం అన్నారు. కావలసిన information కూడా సేకరించారు కనుక, కొంతకాలం వేచివుండవలసిన అవసరంవున్నది. తరువాత ఈ waste lands విషయంలో ప్రభుత్వం వైఖరికి వారిని అభినందిస్తున్నారు. చాలకాలంగా ప్రభుత్వం దీనిమీద తమదృష్టి కేంద్రీకరించలేదు. హరిజనులకు, పేదలకు భూములను సక్రమంగా యివ్వాలి. ప్రభుత్వం దానిగురించి G.O. లుయిచ్చింది, cancel చేసింది. కాని ఒక definite policy లేదు. మన ప్రభుత్వంవారు దీనిగురించి కావలసిన information సేకరించి ప్రత్యేకించి ఒక cabinet sub-committee వేశారు. కాబట్టి యీ సమస్య పరిష్కారం అవుతుందని నాకు నమ్మకం వున్నది. కాబట్టి ప్రభుత్వం వెంటనే యీ సమస్యను పరిష్కారం చేయాలని మనవిచేస్తున్నాను. తరువాత హరిజనుల విషయం. హరిజనులలో చర్మకారులనే వారున్నారు. వారి పరిశ్రమ చాల వెనుకబడి యున్నందువల్ల తిండిలేక యితరమైనటువంటి వృత్తులలో పడుతున్నారు. ఇటువంటి labour ను absorb చేయాలంటే నికరమైన ఆధారం చూపించాలంటె యీ పరిశ్రమను అభివృద్ధి చేయాలి. కనుక slump పరిస్థితులలో సరైనటువంటి నికరమైన జీవనాధారం వచ్చేలాగ పారిశ్రామిక రంగాన్ని అభివృద్ధిచేయాలి.

Agricultural industrial relations లో ఏర్పడిన యీ labour slump తగ్గుతుంది. వారికి జీవనాధారము ఏర్పడుటకు యిక ముందు industrial development చేయాలని మనవి చేస్తున్నాను. తరువాత ఈ Harijan welfare విషయం. ఈ demands మీద చర్చవచ్చినప్పుడు వివరంగా మాట్లాడుతాను. ప్రకాశం పంతులుగారు హరిజనులకు కోటి రూపాయలు ప్రత్యేకించడం చూస్తే, తప్పకుండా ప్రత్యేకమైన శ్రద్ధచూపిస్తారని అనుకుంటాను. ఇండ్లస్థలం విషయంలో 53 వేల రూపాయలు ప్రత్యేకించారు. Land Acquisition Act క్రింద 10 సంవత్సరాలవరకు pending case లు తీర్పుకావడానికి అవకాశం లేదు. ఈ సంగతి ప్రభుత్వదృష్టికి తెస్తూ సాధ్యమైనంత త్వరలో దాన్ని సవరించడానికి Central Government కు మన ప్రభుత్వం recommendatory measures ప్రభుత్వం తీసుకోవాలనే rural areas లోనే కాకుండా urban areas లో కూడా అమలుపరచేందుకు

అనుకూలంగా సవరణ చేయాలని మనవిచేస్తున్నాను. Sheduled tribes విషయంలో మలయప్పన్ కమిటీ రిపోర్టు అమలుకు 10 సం వత్సరములు పడుతుందనుకుంటూను. National Services విష యంలో సూచనలు చేశారు. ఈ రెండూ compare చేసినప్పుడు యీ విషయంలో extension services scheme అమలుపరిస్తే పురోభి వృద్ధి అవుతుందని memorandum లో తెలిపాము. ప్రత్యేకంగా విజ్ఞప్తిచేశాము. మలయప్పన్ కమిటీ రిపోర్టు యింత వరకు పరిశీలింపబడలేదు. దానిగురించి పరిశీలించాలని మనవిచేస్తున్నాను. తరువాత వెంకటేశ్వర యూనివర్సిటి గురించి ఒకటిరెండు విషయాలు మనవిచేయాల్సి వుంటుంది. మొదటినుంచీకూడా, యిదివరకటి బడ్జెటు సమావేశంలో కూడా విజ్ఞప్తిచేశాను. ఒక బడ్జెటును రూపొందించే టప్పుడు ఏ ప్రాంతాలు వెనుకబడివున్నాయో, ఏ ప్రాంతాలభివృద్ధి చెందాలో దృష్టిలో పెట్టుకుని ఆ ప్రాతిపదికమీద రూపొందించవలసినది గాని ప్రాంతీయ అభిమానాలతో రూపొందించకూడదని మనవిచేస్తు న్నాను. దురదృష్టవశాత్తు రాయలసీమవారు సర్కారువారు అనే అల్ల కల్లోలం వచ్చింది. ఇది చాలా ప్రమాదకరమైన సంగతి. మనమందరము కలసి ఆంధ్రులం అనే అభిప్రాయంతో పనిచేయాలని మనవిచేస్తున్నాను. రాయలసీమవారికి యూనివర్సిటీ కావలిస్తే ఆంధ్రా యూనివర్సిటీని తర లించుకోవచ్చును. మాకు కావలిస్తే ఆనర్సు కోర్సులు చదువుకోడానికి మరో 10 రూపాయలు ఎక్కువైనాసరే మేము రాయలసీమకు పోగలం. కాని రాయలసీమ ప్రత్యేక యూనివర్సిటీ అంటే నేను చాల బాధ పడ్డాను. మనకు ఎక్కువగా డబ్బువుంటే జిల్లాకొక యూనివర్సిటీ పెట్టుకోవచ్చును. కాని లోటుబడ్జెటులో వున్న మనరాష్ట్రంలో రాయలసీమ అనే ప్రాంతీయ విభేదాలతో యీ యూనివర్సిటీ స్థాపన బాగులేదని మనవిచేస్తున్నాను. తరువాత ముఖ్యంగా రాయలసీమ అభివృద్ధి విషయం ప్రత్యేకంగా చెప్పవలసివున్నది. రాయలసీమ మనకు కార్బంకుల్ లాంటిది. ప్రతిఏటా కరువు కాటకాలకు రాయలసీమ గురిఅవుతున్నది. ఒక రోగికి చిన్నచిన్న డాక్టర్లను పెట్టి నయంచేయడానికి ప్రయత్నించేకంటే పెద్దవ్యయం అయినాసరే మంచిడాక్టరును పెట్టి ఆ వ్యాధిని నివారించాలి. లేకపోతే మిగతా దేహానికి ఆ వ్యాధి

Sri M. Rajeswara Rao] [9th March 1954

వ్యాపిస్తుంది. అలాగే ఈ బడ్జెటులో రాయలసీమ సమస్యను permanent గా పరిష్కారం చేయడానికి ఆలోచించాలి.

తరువాత General amnesty విషయంలో ఒక విషయం చెప్పదలచాను. General amnesty లో 6 వేల మంది presoners విడుదలయ్యారు. బాగానేవుంది. కాని కొంతమంది వుద్యోగస్తులు disciplinary proceedings లో వున్నారు. వారేమిపాపం చేశారు? Murderers కంటె వారుచేసిన పాపం పెద్దదా? వాళ్ళ విషయంలో కూడా ఆంధ్రరాష్ట్రం వచ్చిన సంతోషసమయంలో వారిని కరుణిస్తే సంతోషిస్తారు. ఆంధ్రరాష్ట్రం వచ్చిన ఈ సంతోషసమయంలో పాత రికార్డులు రద్దుచేసి వారికి fresh గా అవకాశం యివ్వాలని ప్రభుత్వం దృష్టికి తెస్తున్నాను. Co-operation విషయంలో చిన్న మనవి. ఇది వరకు co-operative society స్థాపించడానికి వెయ్యిరూపాయలు share capital కావలసివుండని నిబంధనలున్నవి. దానిని కనీసం 5 వందల రూపాయలకు తగ్గిస్తే Co-operative Societies form చేయడానికి ప్రభుత్వం సహాయపడుతుందని మనవిచేస్తున్నాను. తరువాత ముఖ్యంగా education విషయంలో ఒక మనవి. పరులేకరు కమిటీ నివేదిక అనుసరించి నిర్ణయం తీసుకోడానికి కొంతకాలం పడుతుంది కనుక అప్పటివరకు। teachers కు salaries disburse చేయడానికి ఖర్చు గురించి ఆలోచించకుండా గవర్నమెంటు ఏర్పాట్లు చేయాలని మనవి చేస్తున్నాను. ఈ బడ్జెటులో రాయలసీమ సర్కారు విభేదాలు పాటించకుండా ఆంధ్రులందరూ ఒకటే అన్న సిద్ధాంతంతో పనిచేయాలని ప్రభుత్వం వారికి మనవిచేస్తూ విరమిస్తున్నాను.

* Sri V. CHIDANANDAM: అధ్యక్షా, నన్ను ఇప్పుడుమాట్లాడ నిచ్చినందుకు మీకు కృతజ్ఞతను తెలుపుతున్నాను. మనము ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తర్వాత మొట్టమొదటి సంవత్సరపు Budget ను చర్చిస్తున్నాము. ఆంధ్రరాష్ట్రము అప్పుతోనే ప్రారంభమైంది. ఈ ఆయ వ్యయ పట్టిక అప్పు చూపుతూనే వుంది. నష్టముతో ఆంధ్ర రాష్ట్రము పనిచేయవలసియున్నది. అట్టి సందర్భములో ఇప్పుడు మనము ప్రవేశపెట్టిన Budget సంవత్సరవారి ఆదాయవ్యయపట్టిక సమంజస మైనదే చెప్పవచ్చును. ఐతే మంత్రివర్గమువారు ప్రభుత్వము తరపున

వారు చేస్తామని చెప్పినటులు అన్నీ సమగ్రముగా యిందులో చెప్పబడి వుండలేదు. కొన్నివిషయాలలో యథార్థంగా యీ బడ్జెట్టు ఆమోదించడానికి వీలులేదని నా అభిప్రాయము. ఉదాహరణకు Prohibition తీసుకోండి. ఇప్పుడు మనకు నాయకత్వం వహించిన ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంపంతులుగారు, ఆర్థికమంత్రి విశ్వనాథంగారు మద్రాసులో మమ్ములను Prohibition కు against గా vote చేయమన్నవారు. వారి Prohibition విషయములో తీసుకొనే policy ఏమిటో నిర్ధారణ చేయకుండ consider చేస్తామంటున్నారు. ఆ నిర్ణయము ఏమిటో తేల్చేఅంతవరకు ఊరుకోండి అంటున్నారు. Budget సమావేశము ఏర్పడేవరకు ఇది sitting అని చెప్పడముకాని sessions అని చెప్పడానికిగాని వీలులేదు. Budget session సాంప్రదాయానుసారంగా Governor గారి ఉపన్యాసముతో ప్రారంభము కావలసింది. రాజాజీ గారిని prohibition లో ఓడించదలచి ఓటుచేసినవాండ్లలో నే నొకనిని అందులో majority రాలేదు. నెగ్గలేదు. రాజాజీని Elementary Education Policy లో ఓడించినాము. కాని అది advice గా మాత్రమే తీసుకున్నారు. అప్పుడట్లా vote చేసినవారుకూడ ఇట్లనడము అనేది ఒకప్రశ్న. నీటిపారుదలవిషయంలో కడపజిల్లాలో ఒక పెద్ద Lower Sagileru Project ను శాంక్షనుచేసినారు. అందుకని వారు మైనరు స్కీములు చేయించేదానిలో బద్వేలు తాలూకాలో ఇండియా ప్రభుత్వానికి సిఫారస్సు చేసివుండలేదు అని తెలుసున్నది. రాయచూటితాలూకాలోని కాంచాలమ్మ చెరువును సిఫారసు చేయడమైంది. దానినిచ్చట యీ ప్రభుత్వం ఆమోదించలేదు. రాజంపేట బాదెనగట్ట ప్రాజెక్టు 60 లేక 70 వేల ఎకరాలు సాగుచేసి ఆహారకొరతను తీర్చే పెద్ద ప్రాజెక్టును సిఫార్సుచేయకపోవడము బాగులేదు అచ్చట అసెంబ్లీ మెంబరు కమ్యూనిస్టు కాబట్టి అక్కడ ఏమి తీసుకోగూడదని అనడము చాల తప్పు. క్రిష్ణమూర్తిరావు వున్నాడని పుంగనూరులోను మంత్రి తిమ్మారెడ్డి వున్నాడని వాయల్పాడులోను అభివృద్ధి కార్యక్రమాలు తీసికోబడినవి. మీరు Minor Irrigation విషయము తీసికోండి. ప్రభుత్వము ప్రతి సంవత్సరము sanction చేసే మొత్తములో ఎక్కువ మొత్తమును Overseers గ్రామాలలో సులభముగా వుండే చెరువు repairs కు ఖర్చుచేసి కొత్తచెరువులు కట్టడానికి అవకాశము లేకుండ

Sri V. Chidanandam] [9th March 1954

చేస్తున్నారు. ప్రభుత్వము వీటిని గమనించడము లేదు. ఇక నిరుద్యోగసమస్య. దానినిగురించి మన ప్రభుత్వము బొత్తిగా ఆలోచించడము లేదు. ఉద్యోగాలు Secretary లకు కావలసిన వాండ్లకు యిస్తున్నారు. యిక భూసంస్కరణ, కౌలుదారీ రక్షణబిల్లు అనేది ఎక్కడ లేదు. ప్రాథమిక విద్యావిధానములో పిల్లలకు అర్ధరోజుమాత్రమే చెప్పడము జరుగుతుంది. ఆపిల్లల పెద్దలు మమ్ములను ఎంతగా దూషించుతున్నారో మంత్రులకు తెలియదు. మిగిలిన అర్ధరోజు వాండ్ల తల్లిదండ్రుల వృత్తులు నేర్చుకోవాలి. ఆ పిల్లల తల్లిదండ్రులు తమ జీవనార్థమై బయటికి పనికి పోయినప్పుడు పిల్లలకు వాండ్లవృత్తి ఎట్లా నేర్చెదరో నాకర్థము కావడములేదు. గవర్నమెంటువారు aided school ను తమ స్వాధీనము చేసుకొనకపోతే పిల్లలకు చదువురాదు. Grants ఎక్కువగా ఇస్తేగాని స్కూళ్లు బాగుపడవు. ముఖ్యంగా స్కూళ్ళలో సంస్కృతము చెప్పాలి. అప్పుడే మన హిందూమతము అభివృద్ధిచెందుతుంది. ఇప్పుడు స్కూళ్ళు Christians చేతులలో పడడముచేత మన మతానికి చాల దెబ్బ. ప్రభుత్వము రైతులకు బావులు త్రవ్వించుకోడానికి రు. 750 లు యిచ్చినారు. రైతులు సక్రమంగా తీర్చలేకుండవున్నారు. రైతులను నిర్బంధముపెట్టి జప్తీలు జరుపడము జరుగుచున్నది. దీనిని అరికట్టాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. గ్రామఉద్యోగుల విషయము తీసుకోండి. వాండ్లను enquiry కాకముందే suspension లో పెట్టుతున్నారు. గ్రామఉద్యోగులపైన అధికారము చలాయించడము ఎక్కువైపోయింది. వాండ్లు వంశపారంపర్యమునుండి వస్తున్నారని అంటారు. వాండ్లకు ఎక్కువ జీతాలుయిచ్చి transfers చేయువచ్చును. వాండ్లు whole time servants కారు కాబట్టి జీతాలు ఎక్కువ యివ్వడానికి వీలులేదంటారు. వాండ్లు గౌరవ ఉద్యోగులని ప్రభుత్వమువారు మాటలు చెప్పుతూనే వున్నారు. వారు కాంట్రాక్టులు చేసుకొనరాదని వుత్తర్వు చేసియున్నారు. పరిపాలనావిధానము చాలా loose గాను అధ్వాన్నముగాను వున్నది. యీ machinary లో red-tapism చాలవుంది. ఉదాహరణకు ఆంధ్రరాష్ట్రము రాకపూర్వము ఒక Assistant Engineer లంచం తీసుకున్నాడని ఒకకూలి అర్జీయిచ్చినాడు. ఆ అర్జీని నా covering letter తో P. W. శాఖ మంత్రిగారికి పంపించినాను. ఇప్పటివరకు enquiry జరుగుతూనేవుంది. అందుకొరకు ఒక

ప్రశ్న వేసినాను. అర్జీ చేరిందో, ఏమైందో action తీసికున్నారో లేదో ఏమీ తెలియలేదు. Lands cess విషయములోను, భూములు పేదలకు పంచిపెట్టేదానికి అధికంగా అడిషనల్ కలెక్టర్లను, అసిస్టెంటు కలెక్టర్లను ఇంకా కొంతమందిని వేస్తారని తెలుస్తున్నది. ప్రస్తుతంవున్న కలెక్టర్లుచేస్తే సరిపోతుంది, అట్లాగాకపోతే ఫిర్కాలను చిన్నవిచేసో, తాలూకాలను చిన్నవిచేసో, యీ విధంగా ఏరియాలను చిన్నవిగా చేసుకొని ప్రభుత్వ యంత్రాన్ని చేసుకోవచ్చును, ప్రభుత్వం ప్రతిపనికీ అడిషనల్ కలెక్టర్లను ఎక్కువ వేసినందువల్ల ప్రయోజనం వుండదు. వీరు గ్రామాలకు వెళ్ళినపుడు, వీరికి మర్యాదలు చేయటానికి, కూడుపెట్టడానికి అక్కడ వుద్యోగస్తులు చస్తున్నారు. రోగి, జ్వరమువల్లగాకుండా యంత్రాలబరువు మోపై, చచ్చినట్లుగా వుంటుంది. అట్లాగే, యీ ఆఫీసర్లు గ్రామాలకు వచ్చినపుడు అక్కడి ఉద్యోగస్తులకు వీళ్ళకు వంటలుచేసి పెట్టలేక వంటకు, కట్టెలు దొరకక నానాఅవస్థలు పడటం జరుగుతున్నది.

రైతులకు కొనుగోలుశక్తి చాలా తగ్గింది. దానికి తగిన విధానము ఆలోచింపవలసియున్నది. Special Armed Police లు అనవసరమని శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు చెప్పారు. ఈ విషయంలో, కొంచెము భేదమువుంది స్పెషల్ ఆరమ్డుపోలీసు వుండితీరాలి. మామూలు పోలీసులు ఇతర పనులకు వుండాలి. మేము చచ్చినా ఫరవాలేదు. వీళ్ళను తీసివేయమని అంటున్నారు. వారు అట్లా చస్తామంటే పోనిస్తామా? కాబట్టివారు చచ్చిపోవటానికి వీలులేదు. ఒకరి ఆకలితో చస్తే పెద్దగోలచేసే కమ్యూనిస్టులు పోలీసులు చస్తుతే వూరుకుంటారా? వారిని సంరక్షించడానికి Special Armed Police వుండాలి. గాబట్టి, యీ పోలీసులు వుండితీరాలి. పోలీసులకు తక్కువ జీతాలు యివ్వటం వల్ల, కొంతమంది కమ్యూనిస్టు భావాలు పెట్టుకున్నారని, ఒక అభిప్రాయము వున్నది. ఉద్యోగస్తులుగా వుంటున్నవారు ఎవరూగూడా ఏ పార్టీలలోను వుండగూడదు. అట్లావుండటం, చాలా శోచనీయముగా వుంటుంది. అట్లావుంటే, తగినవిధముగా, ప్రభుత్వం చర్యతీసుకుంటుందని నమ్ముచున్నాను. Andhra State లో efficiency తగ్గిపోయి లంచగొండితనం పెరిగిపోయింది. దీనిని నిర్మూలించవలసినదని ప్రభుత్వాన్ని అర్థిస్తున్నాను. వుద్యోగస్థులు తమ పనులను సరిగాచేయుటలేదు. ఆఫీస

Sri V. Chidanandam] [ 9th March 1954

రులు టూర్సు వెళ్ళినప్పుడు విషయాలన్ని తెలుసుకోకుండా, కరణాలు తయారుచేసిన లెక్కలలో సంతకాలు చేస్తున్నారు. కాబట్టి పూర్వంవున్న efficiency వుద్యోగస్థులలో యిప్పుడు లేదని మనవిచేస్తున్నాను. Tax విషయములో, Sales Tax Bill వల్ల రాదగిన ఆదాయము సంపూర్ణంగా వస్తూవుందని చెప్పడానికి బొత్తిగా వీలులేదు.

ఈనాములలో అనేకరకములైనవి వున్నవి. అందులో చాకరి యీనాములు అని వున్నవి. వీటిని వారు విక్రయించినప్పుడు, పట్టాలు మంజూరు చేయకుండా ప్రభుత్వం ఉత్తర్వులు చేసినది. ఇటువంటి ఈనాములకు పట్టాలు జారీచేసినట్లయితే యీ భూములమీద పన్నులు వస్తవి. ఇంకా భటవర్తి యీనాములు, వగయిరాలవంటివి చాలా వున్నాయి. వీటినన్నింటిని, సర్కారు పట్టాలక్రింద మార్చవలసినదిగా ప్రభుత్వాన్ని అడుగుతున్నాను.

ఇక డెవలప్‌మెంటు ప్రాజెక్టులు. 22 ప్రాజెక్టులు మంజూరు అయినవని, జిల్లాకు రెండువస్తాయని ఆశతో వున్నాము. కడప జిల్లాకు ఒక్కటే అని చెప్పారు. ఇట్లా రావటం పక్షపాతమని చెప్పుతున్నాను. రాయచోటి తాలూకా, బద్వేలి తాలూకా వగయిరా తాలూకాలు చాలా వున్నవి. ప్రస్తుతం ఆ తాలూకాలస్థితి, చాలా హీనముగానున్నది. ఒకచోటయిచ్చి, మరొకచోట తక్కువచేయటంలో, అర్థము కావటము లేదు. మంత్రిగారున్నచోటు అన్ని యిస్తారా? కాబట్టి యీ విషయంలో బాగా ఆలోచించలేదని అనిపిస్తున్నది. మా శిద్దవట్టం తాలూకాకు రెండు elections ప్రాజెక్టులు యివ్వడానికి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వము శాంక్షన్ చేసినను వాటినిగురించి ఏమీ చెప్పబడలేదు. వెంకటేశ్వర విద్యాలయం విషయంలో శ్రీ రాజేశ్వరరావుగారు మాట్లాడుతూ, మార్చితే బాగుంటుందనే దానికి పనికి రాదన్నారు. High Court ను Capital ను Vizag లో పెట్టాలనికోరిన, Vizag వారు వూరుకుంటారా? Capital సమస్యలో శ్రీ రాజేశ్వరరావుగారు మా కర్నూలుపై చూపిన దయ తెలుస్తూనే యున్నదికదా? Weavers ను ప్రోత్సహించటమనేది ప్రభుత్వం చేయవలసినదే. శ్రీ రాజేశ్వరరావుగారు చెప్పినట్లు వ్యవసాయ కూలీల విషయములో ప్రభుత్వంవారి దృష్టి కేంద్రీకరించలేక పోవటమనేది విచారకరము. వీవర్సులో ఎన్నో రకాల [illegible]

వారున్నారు. ప్రపంచములో ఏవర్ని అంటే, అందరుకాపని నామనవి. యుద్ధానంతరము అనేకులు వ్యవసాయదారులు మొదట నేతపని లోను, కొంతమంది మగ్గాల పనిలో ప్రవేశించినారు. "సాలి నేసి సాలి నేత"గా అయింది. వేరేపనిలోకి వెళ్ళలేక, యీ వృత్తిలోను వుండలేక, ఉభయభ్రష్టులుగా వున్నారు. వీరిని గురించి ఒక లెక్క తయారు చేస్తే మంచిది. గోదావరిజిల్లాలో, మన రాష్ట్రములో 11 కోట్లు వేయాలని చెప్పారు. మంత్రులకు కావలసివస్తే రోడ్లు వస్తాయి.

తరువాత ఒక చట్టము మనకు ప్రభుత్వం తలపెట్టలేదు. తలపెట్టమని, మంత్రిగారిని ప్రార్థిస్తున్నాము. శ్రీ డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ గారు ఢిల్లీలో ఒక సభయందు మాట్లాడుతూ, కొంతమంది స్త్రీలు, పురుషులవలె వేషము వేస్తున్నారనీ, ఇందువల్ల పురుషులకు, స్త్రీలకు భేదం తెలియటం లేదనీ, పంజాబుడ్రెస్, bobbed hair లవి, ఒక షరాయి తొడుక్కొని, వారి అంగసౌష్టవమును బహిరంగముగా ప్రదర్శిస్తూ వున్నారని, ఏకాంతముగా భర్తలు చూడవలసిన అంగసౌష్టవమును, యీ విధముగా చూపటం బాగుండలేదని అన్నారు. దాని మీదట శ్రీ నెహ్రూగారు జవాబు చెప్పుతూ, High Officers లో చాలామంది పాశ్చాత్య నాగరికతా మహాత్యంలోబడి సామాన్యప్రజలకు దూరమగుచున్నారని చెప్పిరి. కాబట్టి dress విషయములో, ఫలాని విధంగా వుంటే బాగుంటుందని ఒక చట్టము వుండాలని అంటున్నాను. నాకు యీ time యిచ్చినందులకు చాలా సంతోషిస్తున్నాను. అధ్యక్షుల వారికి వందనము లర్పిస్తూ ముగించుచున్నాను.

* Sri G. YELLAMANDA REDDI :— నూతన ఆంధ్ర రాష్ట్రములో మొదట పూర్తి Budget ప్రవేశపెట్టబడింది. ఐతే, యీ Budget వివరములు చూసిన తరువాత, మొదటనుంచి ఏవిధంగావుందో, దానికిమించి ఒక నూతన సాంప్రదాయముగాని, సిద్ధాంతముగాని ప్రవేశపెట్టబడలేదు. ప్రభుత్వ వుద్యోగులు లెక్కలు తయారు చేయటము, దానికి మంత్రిగారు కొన్ని సూచనలు చేయటం, యీ విధంగా Budget తయారు చేయటం పాతపద్ధతిలోనే జరుగుచున్నది. కాని, ఆంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత, దేశములో ప్రజల ఆందోళనలు [illegible] ఎక్కువగా ప్రదర్శింపబడాలో, ప్రజల కష్టాలు ఏమిటో, ఏ

Sri G. Yellamanda Reddi ] [ 9th March 1954

పనులు సమగ్రంగా జరగాలో, అనే విషయాలను దృష్టిలో వుంచు కోవటం చాలా ముఖ్యమైనది ప్రజలయొక్క సహకారము అత్యవసరము. ఆ విధంగా, ప్రజలకు వుపయోగపడేవి ప్రజలనుత్సాహపరచే విష యాలు యీ Budget లో లేవని మాత్రము నేను మనవిచేస్తున్నాను. అనేక ముఖ్యవిషయాలను గురించి చాలా రోజులనుండి ఆంధ్ర ప్రజలు విజ్ఞాపాలద్వారా, అర్జీలద్వారా ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. ఆంధ్ర ప్రజానీకానికి, యీ Budget చాలా నిరాశను కలిగించిందని నేను మనవిచేస్తున్నాను.

Capital outlay క్రింద, కొన్ని ప్రాజెక్టుల విషయంలో, irrigation projects విషయంగాని, electricity projects విషయంగాని, వీటిని ఆంధ్రప్రజలందరు ఆమోదించేపద్ధతిలో, తీసుకో బడలేదని మనవిచేస్తున్నాను. ఏదో 2 కోట్లలో, 3 కోట్లలో ఖర్చుపెట్టి ఒకటి, రెండు ప్రాజెక్టులు తీసుకొచ్చినంతమాత్రంచేత ప్రజల అంగీకారము, సహ కారం లభిస్తుందని అనుకోవడం పొరపాటు అని, ఇది సక్రమంగా జరగ లేదని మనవిచేస్తున్నాను. ఆంధ్రప్రజలందరికి జాతీయప్రాజెక్టయిన నంది కొండ విషయము యింతవరకూ ఏమీ తేలలేదు. ఆర్థికమంత్రిగారు తమ ఉపన్యాసములో, ఇందుకు సమాధానం చెప్తూ, ఆంధ్రరాష్ట్రము వచ్చింది కాబట్టి ఈనాడు రాష్ట్రపునర్నిర్మాణం గురించి ఒక బ్రహ్మాండ మైన urge ఉన్నదని, అందువలన revenue లో పైపద్దుఖర్చు జాస్తిగా ఉంటున్నదని చెప్పారు. ఇది సంపూర్ణముగా వాస్తవముకాదు. Administration విషయంలో, పోలీసు మొదలగు staff కు ఖర్చు పెరిగి పోయి, ప్రజలకు అత్యవసరమైనట్టి పనులు జరగకుండా పోయినాయి. ఈ రోజు మన capital outlay expenditure ను గత 2 సంవత్సర ములకు పోల్చిచూచినట్లయితే తేడా ఏమీలేదని మనవిచేస్తున్నాను. ఉదాహరణకు 1952-53 లోని capital outlay దానికిని, ఈనాటి దానికిని పెద్ద తేడాలేదు. పూర్వము ఉన్నటువంటి కొద్దిప్రాజెక్టులను కొన సాగించడంమాత్రం జరుగుచున్నది. కాని, కొన్నిముఖ్యమైన irrigation schemes తీసుకోవడం జరగలేదు. నందికొండ ప్రాజెక్టు విషయం చాలారోజులనుంచి చెప్తూనే వచ్చాము. గత బడ్జెటు సమావేశములో కూడ ఈ విషయమై చెప్పాము. ఆర్థికమంత్రి సత్వరచర్య తీసుకొంటామని

చెప్పారు. కాని ఈ బడ్జెటు ఉపన్యాసములో irrigation పద్దులో దీని విషయం ప్రస్తావించలేదు. ఈ నందికొండ విషయములో, చాలా చర్చలు జరిగి అనుమానాస్పదమైన విషయాలు బయటికి వస్తున్నాయి. దీనికట్ట ఎత్తు 591 లేక 560 అడుగులుండవలెనా, లేక 610 అడుగులా అనే విషయము గురించి Engineers సంప్రతింపులు జరిపారు. ఈ విషయము అసెంబ్లీలో ప్రస్తావనకు వచ్చింది. ఈవిషయములో అసెంబ్లీకి యింతవరకు సరియైనసమాధానం ఇవ్వలేదు. హైదరాబాదు Engineers కూడ 591 అడుగులు ఇంకా, అవసరమైతే, 610 అడుగులు ఉండడానికి మాకేమీ అభ్యంతరం లేదని చెపుతున్నారు. ఈనందికొండ విషయములో హైదరాబాదు ప్రభుత్వము తయారుగనే ఉన్నది. కాబట్టి ఆంధ్రప్రజల దను ఆశిస్తున్నటువంటి ఈ విషయంలో ఆంధ్రప్రభుత్వము ఒక స్పష్టమైనటువంటి statement చేయవలసిన అవసరమున్నదని నేను కోరుచున్నాను. ఎందువల్లనంటే ఈ విషయమై నెలనుంచి సంప్రతింపులు జరిగాయి. ఒక joint report కూడ తయారుచేశారు. కనుక ఈ విషయములో, ఒక సంపూర్ణమైనటువంటి రిపోర్టును తయారుచేసి అందరికి అంగీకారముగా ఉండేటట్లు, ఆంధ్రప్రజానీకము ఆశయము సిద్ధించే విధముగా చేస్తే బాగుంటుంది. ఇది 591 అడుగులకు ఏమాత్రము తగ్గించరాదు. వీలుంటె కట్టఎత్తు 610 అడుగులుండేటట్లు recommend చేయాలి. దీనిని 591 అడుగులకంటె ఎత్తు తగ్గించినట్లయితే, నెల్లూరు, గుంటూరు మెట్టతాలూకాలలో చాలాభాగము కాలువక్రిందికి రాకుండా పోతుంది. కొంతమంది experts కూడా 610 అడుగులు ఉండినా పరవాలేదని చెప్పారు, కట్టఎత్తు 590 అడుగులనుండి 560 కి తగ్గిస్తే 6¼ కోట్లు ఖర్చు తగ్గుతుందని చెప్పడం సరికాదు. ఎందువల్లనంటే, దీనివల్ల 10 లక్షలు ఎకరాలు మాగాణికిందకు వస్తుంది. వీటినుండి ప్రభుత్వమునకు ఆదాయం ఉంటుంది. అందువల్ల 6 కోట్లకు భయపడి, దీనిని మానుకోవడం సరికాదు. కట్టఎత్తు 591 కంటే తగ్గిస్తే ఆంధ్రప్రజలు ఏమాత్రము అంగీకరించరు. నందికొండ కుడికాలువ కొలతలు కోస్లాకమిటీ సూచించినట్లు సాగించలేదు. అందుచేత నెల్లూరు, గుంటూరు జిల్లాల మెట్టప్రాంతాలలో అధికభాగము సాగులోకి రాకుండా పోతుంది. ఇది ఈ కరువుప్రాంతాల ప్రజలకు తీరని నష్టాన్ని కలిగిస్తుంది. కుడికాలువ ఖోస్లాసూచించిన విధంగా చేయాలని మనవిచేస్తున్నాను. కృష్ణపై ఒక ప్రాజెక్టు కట్టవలెనని

Sri G. Yellamanda Reddi ] [ 9th March 1954

మూడు సంవత్సరాలనాడు ప్లానింగు కమీషన్ అంగీకరించింది కాని యింతవరకు దానివిషయము యేమి తేలలేదు. ఇప్పుడైనా తక్షణము పంచవర్ష ప్రణాళికలో నందికొండను చేర్చునట్లు చూడాలి. ఈనాడు, ప్రజలు కోరుచున్నటువంటి సిద్ధేశ్వరం, నందికొండలను ప్రారంభిస్తే, ప్రజల సహకారము తప్పకుండా వస్తుంది. ఇందుకు కావలసిన డబ్బు, అప్పురూపములో ప్రజలవద్దనుండి కొన్నికోట్ల రూపాయలు రాగలవని నేను హామీ ఇవ్వగలను. ప్రజలకు ఉపకరించేటటువంటి పనికి పూనుకొంటే, ప్రజలు తప్పక సహకరిస్తారు. ఈ నందికొండ ప్రాజెక్టు విషయమై, దీనిని పంచవర్ష ప్రణాళికలో చేర్పించవలెనని మూడు సంవత్సరములనుండి ప్రజలు ఆందోళన చేస్తున్నప్పటికీ, ఈనాటికినీ, ఇంకా చూస్తున్నాము, ఇదిగో చూస్తాము, అదిగో చూస్తాము, అని అంటున్నారు. ఈ నందికొండ విషయములో, అనేక తర్జనభర్జనలు, దీనికి వ్యతిరేకంగా statements వస్తున్నాయి. నాగార్జునకొండ శిల్పాల రక్షణకోసం ఈ ప్రాజెక్టు వాయిదా వేయమని కొంతమంది అధికారులు చెప్పడము ఆశ్చర్యాన్ని కలిగించకమానదు. ఈ ప్రాజెక్టు విషయములో అటువంటి అనుమానాస్పదమైన వార్తలకు దోహదమివ్వకుండా, దీనిని తప్పకుండా పంచవర్షప్రణాళికలో చేర్చుమని, త్వరగా ప్రారంభించవలెనని కోరుచున్నాను.

ఎందుకంటే, కేంద్ర ప్రభుత్వమే కొన్నికొన్ని పెద్దపెద్ద ప్రాజెక్టులు ప్రారంభిస్తుంది. బీహారు రాష్ట్రములోవున్న మాదిరిగా ప్రాజెక్టులకు ప్రారంభోత్సవాలు, శంఖుస్థాపనలు జరుగుతూవుంటే, మన రాష్ట్రంలో యింకను investigation, re-investigation, ఒడంబడికలు, యిలాంటివి జరిపే పరిస్థితిలోనే మన ప్రభుత్వం వుంటున్నది. ఇప్పటికైనను ప్రభుత్వం తొందరపడి యివన్నియుగూడ పూర్తిచేయాలని చెబుతున్నాను.

Minor irrigation విషయములో ప్రభుత్వం పూర్తిగా శ్రద్ధ వహించి త్వరలో పూర్తిచేయవలసిన అవసరం ఎంతైనావున్నది. కానీ ప్రభుత్వం [illegible] విషయం గుర్తించినట్లు లేదు. [illegible] తాలూకాల్లో వందల [illegible] ప్రా[illegible]కి [illegible] వున్నది. కాని క్రింద కొంత [illegible] [illegible] [illegible] ప్రభుత్వానికి [illegible]

5, 6 సంవత్సరాలనుంచి చాలా కష్టము కలుగుచున్నది. ఇప్పటికి ముగ్గురు కలెక్టరులు వచ్చి యీ విషయమును గురించి, యీ ప్రదేశము చూచి పోయినారు. చివరకు Revenue Board Member కూడా వచ్చి చూచిపోయినారు. ఆ నెయుప్రనుపట్ల గండి పూడ్చివేగాని, ప్రభుత్వానికి నష్టం రాకుండాపోదు అని అభిప్రాయము తెల్పారు. ప్రజలు ఎంతో బాధపడుచున్నారు. ఆ గండి పూడ్చవలసిన అవసరం ఎంతో వున్నది. ప్రభుత్వం యీ విషయంలో శ్రద్ధవహించి నిర్లక్ష్యాన్ని వదలి వెంటనే ఆ గండి పూడ్చించే ఏర్పాట్లు చేయాలంటున్నాను.

తరువాత forests విషయం కొంత ప్రభుత్వం దృష్టికి తేదలచాను. ఆంధ్రరాష్ట్రములో గ్రామాలకు సమీపములోవున్న అడవులలో పేదవాళ్లు పశువులు మేపుకొనడానికిన్ని, కట్టె, కంప తెచ్చుకొనుటకు అవకాశములు కలుగజేయాలి టైము చాలనందున నేను యీ విషయము లన్నియు క్లుప్తముగా చెప్పవలసి వచ్చింది. ఈ అడవులు పేద రైతాంగమునకు వుపయోగము లేకపోవుటవల్ల, వాళ్లు చాలా యిబ్బందులు పడవలసి వస్తున్నది.

రైతులకు ప్రభుత్వం తక్కావి అప్పులు యిస్తున్నారు. ఈ అప్పులు రైతులకు సరిపోయేటట్లుగా యివ్వబడటము లేదు. అవన్ని సకాలంలో అందడములేదు. Composite Madras State లో వున్నప్పుడుకూడా రైతులకు యీ అప్పులు తగినంత వీలుగా యివ్వకుండా చేశారు. మన ప్రభుత్వం వచ్చిన తరువాతనైనా రైతులకు యీ యిబ్బందులు లేకుండా చేస్తారని ఆశిస్తున్నాను.

తరువాత post-war development schemes అని ప్రభుత్వం తలపెట్టింది మా కనిగిరి తాలూకాలో ఎటుచూచినా సుమారు నలభై మైళ్ళవరకు రోడ్లు లేకుండావున్న ప్రదేశాలువున్నవి. ఈ post-war development schemes క్రింద యిదివరలో కొంతపని సాగించబడి యున్నది. ఆ పని contractors వల్ల కానివ్వండి, మరే యితర కారణాలవల్ల కానివ్వండి, ఆ పని అంతయు ఆపివేయబడ్డది. ఇప్పటికైనా ఆ పని వెంటనే తీసుకోవాలి. ఎక్కడ చూచినను ఒక medical dispensary కూడా లేదు. ప్రభుత్వం త్వరలోనే ప్రజలయొక్క క్షేమం

Sri G. Yellamanda Reddi ] [ 9th March 1954

దృష్టిలో పెట్టుకొని, అక్కడక్కడ ముఖ్యంగా యీ dispensariesను ఏర్పాటు చేయిస్తారని ఆశిస్తున్నాను ఆపివేయబడిన యీ development schemes మరల ప్రభుత్వం తలపెట్టి పూర్తిచేయించ కోరుతున్నాను.

Famine Relief Fund నుంచి ఖర్చుచేసే విషయంలో యిది వరకు యీ fund నుంచి 30, 40 లక్షలవరకు ప్రభుత్వం ఖర్చుచేస్తూ వస్తున్నారు. అటువంటిది రాబోవు సంవత్సరం బడ్జెటులో చూస్తే 15 లక్షలే కేటాయించబడినట్లు తెలుస్తున్నది. అక్కడక్కడ బావులు త్రవ్వించడం, minor irrigation works repairs చేయించడం, యిటువంటి చిన్నచిన్న పనులు యీ నిధినుంచి ఖర్చుచేస్తూ యీపనులు సకాలంలో చేయిస్తూ వుంటేనేగాని ప్రజలు క్షామంనుంచి బాధపడడము అనేది తప్పిపోదు అని ప్రభుత్వం గుర్తించవలసి యున్నది.

తరువాత rural water supply scheme ప్రభుత్వం తలపెట్టిన స్కీములలో నొకటిగా వున్నది. మా తాలూకాలో దిగుడు బావులు కావడంవల్ల, పరిశుభ్రముగా వుండకపోవటం వల్ల, ప్రజలు నారికురుపులవల్ల ఎక్కువగా బాధపడుచూ వుంటున్నారు. సాధారణంగా నూటికి 75 మంది యీ కురుపులవల్ల కొన్ని గ్రామాలలో బాధపడుతూ వుంటున్నారు. ఇందుకుగాను గ్రామాలలో అక్కడక్కడ, protected water supply schemes అమలులో పెట్టాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను, ఇవికాకుండా అక్కడక్కడ తోడుకునేబావులు కూడా త్రవ్వించాలంటున్నాను. నారికురుపులవల్ల బాధపడేవాళ్లు డాక్టర్ల వద్దకు వెళ్ళి చెప్పుకుంటే, "ఏమి చెయ్యమంటారు. మావద్ద వాటికి మందులులేవు. తగిన స్టాఫ్ లేదు, రావటానికి conveyance లేదు" అనే విషయాలు యీ డాక్టర్లు చెబుతూవుంటారు. కాబట్టి యీ protected water supply schemes ప్రభుత్వం అమలులోకి తెస్తేనేగాని, గ్రామాలలోవుండే ప్రజలు ముఖ్యంగా యీ కురుపులబాధ నుండి తప్పించుకోలేరు. ప్రభుత్వం యీ విషయంలో తగు శ్రద్ధవహించి వెంటనే యీ స్కీములకు ప్రాముఖ్యమిచ్చి ముందు అమలులో పెట్టుతుందని ఆశిస్తున్నాను.

తరువాత education విషయంలో మా కనిగిరి తాలూకాలో ఒక training school వున్నది. అది యిప్పటికి 10, 12 సంవత్సరాల నుంచి బాడుగయింట్లో పెట్టబడియున్నది. బాడుగక్రిందా నెలకు 70, 50 రూపాయలు యివ్వడం జరుగుచున్నది. ఆ స్కూలుకుగాను ఒక building కట్టించినట్లైతే, ఆ స్కూలుకు యీ బాడుగ యివ్వకుండా తప్పిపోతుంది. అక్కడి ప్రజలు ఈ స్కూలుకు building కట్టించాలని చాలా కాలంనుంచి ఆందోళన చేస్తున్నారు. ఈ సంవత్సరము higher grade, secondary grade training కు కూడా ఏర్పాటు చేశారు. ఈ స్కూలుకు బిల్డింగు కట్టించుట ఎంతైనా అవసరము. ఈ బాడుగవల్ల ప్రభుత్వము ఎంత యివ్వవలసి వస్తున్నదో గమనించాలి. ఈ బిల్డింగు ఏనాడో కట్టించినట్లైతే, యీ బాడుగక్రింద ఖర్చుచేసేది యీ స్కూలుకు ఆదాయముగా మిగిలేది.

ప్రభుత్వానికి నేను యీ రోజున తెలియజేసిన ప్రజావసరాలను దృష్టిలో పెట్టుకొని ముఖ్యంగా నందికొండ ప్రాజెక్టుకు ప్రాముఖ్యమిస్తూ ఆ ప్రజావసరాలను ప్రభుత్వం గుర్తించి త్వరలో నెరవేర్చుతారని ఆశిస్తూ, యింతటితో విరమిస్తున్నాను.

Sri B. GANGAYYA NAIDU:—అధ్యక్షా, మన ఎదుట యీ 1954-55 సంవత్సరానికి బడ్జెటు అంచనాలు పెట్టబడి చర్చకు తేబడ్డవి. లోగడ కాంగ్రెసు ప్రభుత్వంవారు తయారు చేసిన బడ్జెటుకు యీ బడ్జెటుకు ముఖ్యమైన విషయాలలో ఏమాత్రము తేడా లేదు. ఇంకను పాత పద్ధతులలోనే యీ బడ్జెటు అంచనాలు తయారు చేయబడ్డవి. ఇంకను యీబడ్జెటులో రాష్ట్రంలో ముఖ్యంగా మా విశాఖపట్టణం జిల్లాలోని వెనుకబడ్డ ప్రాంతములలోని పారిశ్రామికులు, పేదకూలీలు, రైతులు వాళ్లను బాగు పరచటానికి తగినంత మొత్తము కేటాయించ బడ లేదని నా అభిప్రాయము. మన రాష్ట్రములో వెనుకబడ్డ జిల్లాలో విశాఖపట్టణం జిల్లాకూడ వున్నది. ఈజిల్లాలో అధిక సంఖ్యాకులుగా వున్న ప్రజలు వైద్య విద్య సౌకర్యాలు లేకుండా, వ్యవసాయంమీద ఆధార పడి జీవించుచున్నారని అందరికి తెలుసును. విశాఖపట్టణం జిల్లాలోని ప్రజలు ఎందుచేత ఆర్థికంగా వెనుకబడి వున్నారో గుర్తించి, యీ

Sri B. Gangayya Naidu ] [ 9th March 1954

ప్రభుత్వంవారు వారిని ముందుకు తీసుకొని రావటానికి కృషి చేయవలసి యున్నది. విశాఖపట్టణం జిల్లా చాలాభాగము జమీందార్ల చేత ఆక్రమించబడియుండిన కారణంవల్ల, ఆ జమీందార్లే యీ పేద రైతులవద్ద నుంచి శిస్తులు వసూలు చేసి, ఆసొమ్మంతా గూడా వారి స్వంతానికి ఖర్చు పెట్టుకుంటున్నారు. జిల్లాలో మంచి నీటి వనరులు వున్నప్పటికిని, వాటిని సరియైన పద్ధతిలో వుపయోగించకుండా, ఏకొద్ది మొత్తము గూడా చెరువులు, కాలవలు మరమ్మతుల వ్యవహారాలకు వుపయోగించకుండా వసూలుచేసిన డబ్బు అంతా వారి స్వలాభానికి వుపయోగించుకోవడంవల్ల, రైతుల బాగు ఏమాత్రము చూడబడలేదు. ఈ కారణముగా రైతులు ఆర్థికంగా దెబ్బతిన్నారు. అందువల్ల యీ విశాఖపట్టణం జిల్లా చాలామటుకు మెట్టప్రాంతమనే చెప్పవలసి యున్నది. రైతులు మెట్ట పంటలు మీదనే ఆధారపడియున్నారు. వర్షాధారంవున్న జిల్లా అయినప్పటికిని ప్రజలు యేవిధంగాను బాగుపడలేదు. ఇప్పటికి గూడా వారి ఆర్థిక స్థితి చాలాహీనంగా వున్నది. మాజిల్లాలో వీరవల్లి తాలూకాలో మాడుగుల ఎస్టేటు వున్నది. ఒకసంవత్సరం క్రింద యిది రద్దుచేయబడింది. ఈఎస్టేటులో చాలా నీటి వనరులు వున్నవనిన్నీ, యీ వనరులు బాగుచేస్తే మెట్టపంటలే కాకుండా పల్లపు సాగుగూడా చేయవచ్చుననిన్నీ ప్రభుత్వం దీనియందుశ్రద్ధ వహిస్తే, ప్రజలు బాగుపడుతారని యిదివరకు ఎన్నోసార్లు మన శాసన సభలో ప్రభుత్వ దృష్టికి తెచ్చియున్నాను. ఆ నాడు యీ ఎస్టేటు జమీందార్ల స్వాధీనములో వున్నప్పుడు ప్రభుత్వం యీ నీటి వనరులు బాగుచేయటానికి వీలులేదని చెప్పారు. యిప్పుడు యీ ఎస్టేటు రద్దు అయి ఒకసంవత్సరము అయింది. ఈ ఎస్టేటు ప్రాంతంలోని భూమి యిప్పుడు రైతువారి భూమి అయింది. ప్రభుత్వం యీ ప్రాంతంలో శిస్తు వసూలు చేస్తూండడం తప్ప, యీ ప్రాంతాన్ని అభివృద్ధికి తీసుకొని రాకుండా నిర్లక్ష్యం చేస్తున్నట్టు యీబడ్జెటు అంచనాలవల్ల స్పష్టమగుచున్నది. ఈ వీరవల్లి తాలూకాలో శారదా నది అనేది ఒక జీవనది పారుతున్నది. దీనికి నీటి వసతి బాగావున్నది. దీనికి యిదివరలో ఒక ఆనకట్టగూడా కట్టబడి వున్నది. ఈ అనకట్ట పగిలి పోయిన కారణంగా దీనికి మరమ్మతులు లేక శిథిలావస్థలో వున్నది. ఈ అనకట్ట మరమ్మతు చేయవలసిందిగా ప్రభుత్వానికి ఎన్నో విజ్ఞప్తులు చేయడమైనది. ఇదివరకు ఎన్నో ఆర్జీలు

పిటీషనులు అక్కడి రైతులు పంపుకొని యున్నారు. ప్రభుత్వం యీ అర్జీలు, పిటిషనులు చూచినట్లు కనబడదు. ప్రజలయొక్క అవసరాలు గుర్తించినట్లు కనబడదు. ఈ ఆనకట్ట మరమ్మతు చాలా నిర్లక్ష్యము చేయబడుచున్నది. ఇంతవరకు ఏవిధమైన steps కూడా ప్రభుత్వం తీసుకోలేదు. ఇప్పటికి 5, 6 మాసాలక్రితం Executive Engineer preliminary investigation చేయటానికి వచ్చి, యిప్పుడు ఆనకట్ట వున్నచోట మరల కట్టితే ప్రయోజనము వుండదు, డబ్బుకూడా వృథాగా ఖర్చు చేసినట్లు అవుతుంది, పైగా చాలా అవుతుంది. అందువల్ల అక్కడ కట్టిన లాభములేదు, యింకా ఎక్కడనో అరండేలుడాము దిగువ భాగాన దేవరపల్లివద్ద రిజర్వాయరు కట్టితే ఎక్కువ భూమి సాగులోనికి వచ్చి ప్రజలకు మరింత వుపయోగపడుతుందని సిఫార్సు చేశారు. అటుతరువాత 5, 6 మాసాలు అయిన తరువాత ఛీఫ్ యింజనీరుగారు వచ్చి, యీడాము యిక్కడ కట్టకూడదు, దీని వల్ల లాభములేదు తాడ్రపల్లి వద్ద కట్టితే యింకా వుపయోగముగా వుంటుంది గనుక అక్కడ కట్టవలసిందని ఆయన చెప్పారు. ఈ విధంగా preliminary investigation -నే పేరుతో యీ యింజనీరు వచ్చి చూచి యేదో ఒకటి వ్రాసి పోవడమేగాని, దీన్ని బాగుచేసేయత్నం ఒకటికూడ కనబడదు. ఆ తరువాత యింకొక యింజనీరువచ్చి ఇదిఇక్కడ కట్టేదానికన్న యీ ఎస్టేటులో లింగవారిపల్లినుంచి కొడువల్లి వరకు ఆమధ్య ప్రాంతంలోవున్న భూములన్నియు సాగులోనికి రావటానికి వీలుంటుంది. కాబట్టి అక్కడ కట్టితే బాగుంటుందని ఆయన వ్రాశాడు. కాబట్టి యీ preliminary investigation అనే పేరుతో కాలయాపన చేయకుండా ఒకేసారి detailed investigation చేయించి, estimates తయారు చేయించి యీ పని త్వరలో ప్రారంభించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. వీరవల్లి తాలూకాలో ముఖ్యమైన నీటినర్లు ఎక్కువగా వున్నవి. అక్కడ పోడూరు కోనేరువద్ద కట్టినట్లైతే, సుమారు 20 వేల యకరాల భూమి సాగులోనికి రావటానికి వీలగుతుంది. ఈ విషయము రైతులు అనేకసార్లు ఎన్నో విజ్ఞప్తులద్వారా ప్రభుత్వానికి తెలియపరచడమైంది. ఈ శారదా నదికి ఆనకట్టవిషయంలో ఎన్నిసార్లు ప్రభుత్వదృష్టికి తెచ్చినప్పటికిని, ప్రభుత్వం యింజనీర్లుచేసిన investigation ఎంతవరకు వుపయోగించుతుంది అనేవిషయం ఎత్తుకున్నట్లు కనబడదు. ఇంజనీరు

Sri B. Gangayya Naidu] [9th March 1954

వద్దకు ప్రజలు వెళ్ళి చెప్పుకుంటే, మమ్ములను ఏమిచెయ్యమంటారు, మావద్ద తగిన staff లేదు, గవర్నమెంటువద్దకు పోయి శాంక్షను తెచ్చుకుంటే, మేము ఆపని చేస్తామంటున్నారు. ఇక్కడ ప్రభుత్వం వద్దకు వస్తే అది అంత సులభమైన పనికాదు. త్వరపడి లాభంలేదని కాలయాపన చేయటానికి చూస్తుంటారు. ఈ మధ్య మన ముఖ్యమంత్రి ప్రకాశంపంతులుగారు మా జిల్లాలో పర్యటించే సమయంలో యీ ప్రదేశము అంతయు తనిఖీచేసి, రాబోవుసంవత్సరపు బడ్జెటులో సొమ్ము కేటాయించి యీ పని ప్రారంభించేటట్టు చేస్తామని చెప్పి వచ్చారు. ఇదంతా జరిగినప్పటికి గూడా యీవిషయం యిప్పుడు మనముందు వున్న రాబోవు సంవత్సరపు బడ్జెటులో ఏమూల సూచినను కనబడక పోవటం చాలా శోచనీయంగావున్నది. ఈ ఎస్టేటులో ఇన్ని నీటిసౌకర్యాలు వున్నప్పుడు యివన్నియు బాగుచేయిస్తే, యీజిల్లాలోని ప్రజలు తిండికి కష్టపడకుండా జీవించగలరు. ఈ జిల్లాలో నూటికి యాభై వాతులకు పైగా ఈ క్షామం తప్పిపోతుంది. ఈనీటి వనర్లు అన్నియు ఒక్కొక్కదాన్ని తీసుకొని బాగుచేయించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. కొద్దికాలంలో, ఎక్కువ భూమిసాగులోనికి వచ్చే చోట, తక్కువ ఖర్చులో కట్టటానికి వీలయిన చోట్లువున్నవి. అవిముందు తీసుకోవాలని ప్రభుత్వానికిమనవిచేస్తున్నాను. నీటితీరువలు, శిస్తు వసూలు విషయంలో జమీందార్ల హయాములో ఎకరానికి 20 రూపాయలు రైతులు జమీందార్లకు చెల్లించు చుండేవారు. అప్పుడే ఈపన్నులు భారమై రైతులు కృంగి కృశించుచుండేవారు. ప్రభుత్వంవారి స్వాధీనములోకి వస్తేపన్నుల భారము తగ్గుతుందని ఆశిస్తే, ఈ ప్రభుత్వం వారిస్వాధీనములోకి వచ్చినతరువాత గూడా ఈ పన్నులు భారము మరింత ఎక్కువఅయింది. ఎకరానికి 20 రూపాయలు కట్టే భూమికి యిప్పుడు 25 రూపాయలు వసూలు చేస్తున్నారు. శిస్తుక్రింద యింతఅని, నీటితీరువలని, శెస్సులని రకరకాలుగా, యింకా అయిదు రూపాయలు పెంచారు. పన్నుల భారము తగ్గుతుందని ఆశిస్తే యిప్పుడు మరింత ఎక్కువ చేశారు. శిస్తు చూడటానికి 18 రూపాయలకు తగ్గించినట్లు కనబరుస్తూ. యితర శెస్సులు వగైరాలు జాస్తిచేసి, మొత్తము మీద ఎక్కువగా వసూలుచేస్తున్నారు. అందులో ప్రథమపంటకు యింత అని, రెండవపంటకు యింతఅని, ఈ విధంగా మధ్య పెట్టి ఎక్కువ శిస్తు లాగటంగా కనబడుతున్నది. మా జిల్లాలో రైతులయొక్క ఆర్థిక స్థితి

9th March 1954] [Sri B. Gangayya Naidu

ప్రభుత్వం దృష్టిలో పెట్టుకొని, శిస్తులు తగ్గించవలసిందిగా ఇంతవరకు ఎన్నో పర్యాయాలు ప్రజలు కోరియున్నారు. ప్రభుత్వం ఈవిషయంలో ఏమాత్రం శ్రద్ధవహించలేదు.

మరొకవిషయం చెబుతున్నాను. ఈమధ్య రెండు మూడేండ్లక్రితం Central Government వారు well subsidy scheme క్రింద రైతులకు అప్పులు యిస్తున్నారు. దీనియొక్క వుద్దేశ్యము రైతులు వారి వారి భూములలో బావులు తీయించుకొని పంటలు పండించటానికి సహాయం చేస్తున్నారు. ఈ అప్పు యిచ్చేటప్పుడు ఒకరకమైన షరతుక్రింద యిచ్చారు. రైతులవద్దనుంచి ప్రభుత్వము హామీగూడ తీసుకున్నది. గవర్నమెంటువద్దనుంచి అప్పుతీసుకున్న రెండుమూడు ఏండ్లలోపల యీ బావులు పూర్తిచేయాలనే షరతుమీద అప్పులుయిచ్చారు. ఆ షరతులోపల పూర్తిచేసేటందుకు వీలుకాని కారణంచేత ఆ అప్పుల మూలంగా యివ్వబడ్డ డబ్బు అంతయూ వసూలుచేయుమని రివిన్యూ మినిస్టరుగారు ఉత్తరువులు చేశారు. ఈ వుత్తరువులవల్ల రైతులకు చాలా అన్యాయాలు జరుగుచున్నవి. ఈ బావులు సకాలంలో కట్టటం పూర్తి చేసుకోలేక పోయారు. కాబట్టి ఈ అప్పులు ప్రస్తుతము యీ రైతులవద్ద నుంచి వసూలుచేయడం అవసరములేకుండా ఒక stay order యివ్వవలసిన అవసరము వున్నట్లుగా కన్పిస్తున్నది.

ఈ బడ్జెటులోచూస్తే, ప్రభుత్వం ఏవో కొత్తపన్నులు వేయటానికి పూనుకొన్నది కొత్తపన్నులు వేయుదలచినప్పుడు ప్రజల ఆర్థికస్థితికూడా ప్రభుత్వం గమనించవలసియున్నది. అటువంటిది ఏమీ కనబడదు. ముఖ్యంగా మా శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలలోని రైతులు యెంత హీనస్థితిలో వున్నారో ప్రభుత్వం గుర్తించినట్లు లేదు. నీటి తీరువలుగూడా హెచ్చుచేస్తున్నారు.

ఇప్పుడు commercial crops అంటే, వాణిజ్యపంటలు రాష్ట్రములో పండుచున్నవి. ఈ పంటలమీద చాలామంది ప్రజలు ఆధారపడి పండించుకొంటూ యిదే జీవనాధారంగా చేసుకొని జీవించుచున్న జిల్లాలు కూడా వున్నవి. అలాంటప్పుడు యీ పంటలమీద పన్నులు వేస్తే రైతులు ఆర్థికస్థితి అసలే పడిపోయిన సమయంలో మరింత క్షీణపరిస్థితికి

పోగలదని అంటున్నాను. కొలుగోలుశక్తి పూర్తిగా పడిపోయినందువల్ల, ఆర్థికదుస్థితిని ప్రజలు ఎదుర్కొంటున్నారు. ఈ కారణమువల్ల ప్రభుత్వము తలపెట్టిన యీ కొత్తపన్నులు ప్రస్తుతము రద్దుచేయవలసిందిగా కోరుతున్నాను.

తరువాత Prohibition విషయం తీసుకుంటే, ప్రజలకోరిక ఎట్లున్ననూ, ప్రభుత్వంవారు ఒక కమిటీని వేశారు. ఆ కమిటీవారు యీ Prohibition రద్దుచేయవలసిందిగా సిఫార్సు చేసినట్లు తెలుస్తున్నది. ప్రజాభిప్రాయం ప్రకారమే ఆ కమిటీవారు ఆ విధంగా రిపోర్టు పంపగలిగారు అనే విషయం ప్రభుత్వం గుర్తించాలి. రాష్ట్రములో చూద్దామంటే ప్రజలు యావన్మంది ఏకగ్రీవంగా యీ Prohibition రద్దుచేయాలనే కోరుతున్నారు. ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వం పాటించితే సమంజసమైన విషయమని చెబుతున్నాను. ఈ Prohibition రద్దుచేస్తే ప్రభుత్వానికి ఆదాయము కోటానుకోట్లు రాగలదు. ఆ డబ్బుతో రాష్ట్రములోని వెనుకబడిన ప్రాంతాలలో ప్రాజెక్టులుకట్టి, ప్రజల ఆర్థికపరిస్థితి ఎందుకు బాగుచేయకూడదు? ప్రజలు యీ పరిస్థితులనుండి ఎందుకు యిబ్బందులు పడాలి? ఈ Prohibition రద్దుచేయడంవల్ల లభించే ఆదాయముపెట్టి ప్రజలను ఎన్నోవిధాల ముందుకు తీసుకురావటానికి అవకాశాలువుండును. కాబట్టి యీ కొత్తపన్నులువేసే proposalను, Prohibition ను, రద్దుచేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ, బడ్జటులో చూపించిన taxation proposals మార్చాలని ప్రభుత్వాన్ని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri S. VEMIAH :— అధ్యక్షా, ఇప్పుడు మనముందర వున్న బడ్జెటును పురస్కరించుకొని, కొన్ని విషయములు ప్రభుత్వ దృష్టికి తీసుకు రావలసిన అవసరమువుంది. భూములు బీదలకు పంచి పెడతామని, యీ Budget లో సూచించారు. దీనిని గురించి, గత Budget సమావేశములో ముఖ్యంగా కొన్ని సూచనలు సూచించాము. అందుకు ఒక పథకమును తయారుచేసి అందజేయవలసినదని శ్రీ టి. విశ్వనాథంగారు కోరారు. ఇప్పుడు భూములను పంపకము చేసే విధానములో, ప్రభుత్వ లెక్కలను తీసుకొన్నట్లయితే, అవి చాలా తప్పుగా వుంటాయి. దానికన్న గ్రామాలవారిగా సరియైన సాగుకు

లాయిక్ అయిన భూముల list తీసుకుంటే చాలా బాగుంటుంది. 1918-వ సంవత్సరములో depressed classes కు భూములుయివ్వాలని చెప్పి, ఒక list ను తయారుచేయమన్నారు. అప్పుడు కొందరు గ్రామోద్యోగులు మంచిమంచి పొలాలను దాచిపెట్టి, యెందుకూ పనికిరాని భూములను, స్మశానాలకు పనికివచ్చే భూములను వారు ఆ list లో పొందుపరచి యిచ్చారన్న విషయమును యిప్పుడు మీ దృష్టికి తీసుకు వస్తున్నాను. అందువల్ల యీనాడు యీ లెక్కలను తిరిగి సేకరించాలని, ఆ విషయం ప్రభుత్వము పునారాలోచన చేయాలని నేను కోరుతున్నాను. ఇవన్నీ వారికి న్యాయంగా యిచ్చే విషయము ఆలోచించవలసినదని అంటున్నాను. ఆనాడు వారు assignment చేసిన తరువాత చూస్తే, అన్ని అవి పనికిరాని భూములుగా అయివున్నవి. అందుచేత, యీనాడు కూడా ఆ గ్రామోద్యోగులపై ఆధారపడకుండా వుండి, ఈ లెక్కలను సేకరించుటకొరకై, ప్రత్యేక కమిటీవేసి, ఆ కమిటీద్వారా లెక్కలను సేకరించి, ఆ భూములను పేద హరిజనులకు యివ్వవలెనని నేను కోరుతున్నాను. ఈ భూములను పంపకములో, పేదలకు యివ్వడానికి, పెద్ద, పెద్ద procedures ను adopt చేయవద్దని నేను కోరుతున్నాను. ఇప్పుడు political sufferers కు బంజరు భూములను యిచ్చేటప్పుడు అనుసరించే procedure నే follow అవకుండా, శీఘ్రంగా పేదహరిజనులకు ఆ భూములపై పట్టాలు యిచ్చేటట్లుగా చేయాలని. దీని విషయంలో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించుటకు ప్రభుత్వము ఆలోచించవలసినదని నేను కోరుతున్నాను. ఈ విధంగా అనుసరించి, చేసినట్లయిన అది ప్రభుత్వమునకు గూడ లాభదాయకము. అందుచేత వాటిని వారికి తొందరగా పట్టాలు యిచ్చి, వాటిమీద శిస్తులు వసూలుచేయాలని వుత్తర్వులు యివ్వాలని అంటున్నాను. అనవసరంగా వాటిని యిప్పుడు దాచిపెట్టడంవల్ల వాటిలో సాగుజరుగకుండా పోతున్నది. ఈ భూములు చాలమట్టుకు యీలాగున వున్నాయి. దీనిలో assessed dry అని, assessed wet అనివున్నవి. వీటికిగూడ వెంటనే పట్టాలు యివ్వకుండా, 30 సంవత్సరములనుండి సాగుచేస్తున్నా కూడా, ఇంతవరకూ వారికి పట్టాలుయివ్వకుండా బాధలు పెడుతున్నారు.

Sri Vemiah] [9th March 1954

D. C. lands కొన్ని వున్నవి. 1918-20 సంవత్సరముల [illegible] భూములమీద పనిచేస్తున్నప్పటికి, ఆ D. C. people వాటిని [illegible] విక్రయము [illegible] కూడా, ఆవచ్చిన D. C. భూము [illegible] తెల్పుకోకపోవడంవల్ల, వాటిని యీనాడు బీడులుగా [illegible] జరుగుచున్నది. అందువల్ల, ఆ విషయంలో తక్షణ చర్యలు [illegible] D. C. Lands, C. T. settlers కు reserve చేసిన భూములు [illegible] సాగుచేయడానికివీలుగా, ప్రభుత్వము [illegible] ఉత్తర్వులు జారీచేయాలని కోరుతున్నాను ఈ D. C., C. T. [illegible] కు కేటాయించిన భూములు యీరోజున వారి స్వాధీన [illegible], ఇతరులు అందరూ సాగుచేయడం జరుగుతోంది. అందుచేత, గవర్నమెంటు వెంటనే చర్యతీసుకొని, అలాంటి భూములను reserve [illegible] D. C. people కు C. T. settlers యివ్వకపోవడము చాలా [illegible] విషయము.

మా జిల్లాలో, కోవూరుతాలూకాలో ఒక భూమినిగురించి తగువు వచ్చింది. అది హైకోర్టువరకు పోయింది. అది D. C. land అయినప్పటికిన్నీ [illegible] హైకోర్టు తీర్పుయిచ్చింది. దానిని ప్రభుత్వమువారు [illegible]. D. C. people కు సంక్రమించేటట్లు చూడక ఆ పెద్దరైతు సాగుచేసుకొనేటట్లు తీర్పుయిచ్చారు. అందుచేత దానిని ఆ D. C. class people కు యివ్వడానికి ప్రభుత్వం వెంటనే వుత్తర్వులు జారీచేస్తారని నేను [illegible]. ఈ విషయమై ప్రభుత్వము యీ కేసును సుప్రీంకోర్టుకు తీసికొనిపోవలసినదిగ అభ్యర్థించుచున్నాను.

ఇక tank beds విషయంలో, నేను మొన్న కొన్ని సూచనలు యిచ్చాను. చెరువులు చాలాభాగం silt up అయిపోయినవి. ఆ భూములమీద penalty రద్దుచేసి, అదికూడా పట్టాలకు యిచ్చుటకు ప్రభుత్వము పూనుకోవలెనని నేనుకోరుతున్నాను.

ఇక forest lands తీసుకుంటే, Forest Act ప్రకారం lease కు యివ్వకుండా, వృధాగావుండే భూములు వున్నవి. ఆత్మకూరు తాలూకాలో, కరేడు కోటేటిగుంట అనే గ్రామందగ్గర 500 యెకరములు భూమి colonisation scheme క్రింద యిస్తామన్నారు.

9th March 1954] [Sri S. Vemiah

ఇప్పటి అది 6 సంవత్సరములనుండి సాగులేకుండా బీడుగా వున్నది. ఈ విధంగా అనేక ప్రదేశాలలో యీ forest lands కూడా వున్నవి. వాటికికూడా పట్టాలు యివ్వడానికి యే విధమైన ఆక్షేపణలేదని నేను మనవిచేస్తున్నాను. అంతేగాకుండా, యింకా యెన్నో లక్షలాది యెకరాల deserted dry lands వున్నవి. ఒకటి వుదాహరణకు చెప్పాలంటే, పూడిపర్తి అనే గ్రామంలో రెండువేల యెకరాల అనాక్షేప భూములు వున్నవి. హరిజనులకు 500 ఎకరములు యివ్వబడినవి. రైతుల ఆక్షేపణవల్ల ఈ వ్యవహారం Board of Revenue వరకు వెళ్ళడం జరిగింది. మళ్ళీ తిరిగి ఆ papers క్రిందకు వచ్చినవి. నాకు తెలిసినంతవరకు, Board వారు Board Standing Orders ప్రకారం భూమిపట్టాకు యివ్వాలని వున్నది. దానికి యింతవరకు పట్టాలు యివ్వకుండా పోవడమేగాక హరిజనులను బాధలుపెడుతున్నారు. వారిని ఆ భూములలోనికి రానివ్వడంలేదు. ఆభూమిపై పంటపోవటమేగాక, ఆ విధంగా ప్రభుత్వమునకు శిస్తురాకుండా రైతులు చేస్తున్నారు. ఆభూమిని కంచెలుగా పశువులను మేపుకోకుండా చేయవలెనని చూస్తున్నారు. కాబట్టి ఆ కంచెభూముల విషయంలో ప్రభుత్వం దర్యాప్తుచేయించి, వెంటనే నేను చెప్పిన సూచనల ప్రకారము అమలు చేయాలని చెప్తున్నాను.

ఇక, రైల్వే భూములు కొన్నివున్నవి. Railway department (Central Government) తో మన రాష్ట్రప్రభుత్వము యీ భూముల విషయంలో సంబంధం పెట్టుకొన్నందువల్ల చాలా ఆలస్యం జరుగుతున్నది. ఆ భూములలో పేదరైతులు పైర్లువేసుకొన్నారు. ఆ భూములను యిప్పటికీ వేలంవేసి యిస్తున్నారు. అందుచేత యిప్పుడు లంకభూములు యిస్తున్నట్లు, వేలంలేకుండా, యీ సొసైటీలకు యీరైల్వే భూములను యివ్వాలి. అంతేకాకుండా, coastal areas లో Central Government కు కావలసినభూమి, వుప్పు వుత్పత్తికి వుపయోగపడేభూమి కాకుండా, Central Government స్వాధీనములోవుండే భూములను, యీ రెండిటిని మన రాష్ట్రప్రభుత్వము స్వాధీనముచేసుకోవలసిన అవసరం వుంది. ఈ భూముల పంపకానికి వెంటనే-ప్రభుత్వం పూనుకోవాలని చెప్తున్నాను.

Sri S. Vemiah] [9th March 1954

ఇనాందార్ల గూడా కొన్ని భూములు వున్నవి. జమీందారీలు abolish చేయాలని ప్రభుత్వము చెప్తున్నారు, కాని వారి స్వంత కమతాలక్రింద నేక నాకరాలు సాగుజరుగుచున్నది. ఈస్వంత కమతాలు పేరు చెప్పి వారంతాలలోను రైతులను అనేకచోట్ల బాధపెడుతున్నారు అక్కడ రైతులను అనేకరకాలుగా బాధపెడుతున్నారు. స్వంతపట్టాలు లేనివారికి యీ భూములకు పట్టాలుపై యివ్వడం, వారిపై కోర్టులో రిట్లు (writs) వేయడం యీవిధంగా వారిని చాల బాధలు పెడుతున్నారు. అందుచేత, ప్రభుత్వం యీభూములను వెంటనే స్వాధీనము చేసుకొని, యీ estates అన్నింటిని రద్దుచేసి, యీ భూములను తిరిగి సంక్రమించకుండా వుండేటట్లు చూడాలని కోరుతున్నాను. కంట్రోలన్ని చాలాచోట్ల తిరిగి జమీందార్లకు యివ్వడము జరుగుచున్నది. దీనినిగూర్చి వెంటనే చట్టముచేసి పేదల రక్షించాలి. రెవిన్యూ డిపార్టుమెంట్ దగ్గర బంజరుభూముల లెక్కలు ఉన్నాయి. కాబట్టి అట్టి బంజరులను నరల వాళ్ళకు వాపస్ ఇవ్వడం జరుగుతున్నది. కనుక వెంటనే ప్రభుత్వం ఈ భూములను భూమిలేని వాళ్ళకు పంచి ఇవ్వాలని కోరుతున్నాను. ప్రభుత్వంవారు ఇప్పుడిచ్చిన లెక్కలనుబట్టి చూస్తే 13లక్షలపైచిల్లరకు భూమి ఉన్నట్లు లెక్కలు ఇచ్చారు. భూములు ఉన్నవాళ్ళుకూడా కొన్ని లక్షలు ఎకరాలు స్వాధీనం చేసుకున్నట్లు కనిపిస్తున్నది 1949, 1953 G. O. లో 5 ఎకరాలకంటె ఎక్కువభూమి ఉన్నవాళ్ళకు భూమి ఇవ్వకూడదని ఉంది. అందుచేత ఆ విధంగా స్వాధీనం చేసుకున్నటువంటి వాళ్ళదగ్గరనుంచి ఎకరాకు 20 రూ. చొప్పున పెనాలిటీల ద్వారా రెట్రాస్పెక్టివ్ ఎఫెక్టుతో వసూలుచేస్తే ఒకకోటి రూపాయల ఆదాయం మనం రాబట్టవచ్చు. తరవాత ఈ marriages అన్నీ కూడా ఇప్పటి పద్ధతిలో కాకుండా, ఒక్కొక్క marriage కి ఇంత ఫీజు అని పెట్టి రిజిష్టరుచేస్తే దానివల్ల కొంత రాబడి సంపాదించవచ్చని చెబుతున్నాను.

అగ్రికల్చర్ ఇన్‌కంటాక్సుకూడా వసూలుచేస్తే బాగుంటుంది, బెటర్‌మెంట్‌టాక్స్ వసూలు చేయడానికి కొందరు అప్పోజ్ చేస్తున్నారు. కాని నేను దాన్ని బలపరుస్తున్నాను. ఈ ఆకుతోటలు అవీ ఉన్నాయి. ఒక్కొక్క ఎకరానికి 1200 రూపాయలచొప్పున రైతుకు సాగుచేసుకో

డానికి ఇచ్చి ఎకరానికి 10 రూపాయలకంటె ఎక్కువ శిస్తు కట్టకుండాలేరు. అందుచేత కమ్మర్షియల్ క్రాప్స్ విషయంలో పన్ను వేయడానికి ఏలాంటి అభ్యంతరం లేదని చెపుతున్నాను.

తరువాత చాలామంది డబ్బున్నవారు జ్యూయిలరీ అంతా వంటిమీద పెట్టుకొని మోయలేక బాధపడుతున్నారు. దానికోసం 10 తులాల కంటె ఎక్కువ బంగారం ఉండగూడదని నియమించి వాళ్ల మీదకూడా కొంత టాక్సు వేయాలని కోరుతున్నాను.

ఈ sales tax వసూలు చేయడం విషయంలో చాలామంది ఎగవేస్తున్నారు . King George Hospital కు ఎదురుగా ఒక మెడికల్ స్టోర్సు వాళ్ళ దగ్గరనుంచి సములు అమలుజరపి tax వసూలు చేయడానికి ప్రభుత్వానికి 4 వందలు ఖర్చైంది. అలాకాకుండా సకాలంలో వీటిని వసూలుచేసినట్లయితే ప్రభుత్వానికి ఇంకా ఎక్కువ డబ్బు రావడానికి వీలౌతుందని చెపుతున్నాను. ఈ బర్మాషెల్, కాల్టెక్సు మొదలైన కంపెనీలవాళ్లు చాలా లాభాలు సంపాదించి పట్టుకుపోతున్నారు. వాళ్ల దగ్గర నుంచి ఎక్కువ tax వసూలు చేయవచ్చు.

ఇక రిట్రెంచిమెంటు విషయంలో ఈ రెవిన్యూ పోస్టులు డిప్యూటీ కలెక్టర్లు డిప్యూటీ సూపరింటెండెంట్స్ ఆఫ్ పోలీస్, మొదలైన కొన్ని డిపార్టుమెంట్స్ వారిని రద్దుచేస్తే బాగుంటుంది. D. M. O. ప్రస్తుతము పనిచేయుచున్న ఆసుపత్రులపని District Health Officers కు వప్పగించితే D. M. O. ప్రయాణఖర్చులు మిగులును.

మంత్రులు మొదలైనవారు 50 వేల రూపాయలకంటె ఎక్కువ ఆస్థిఉన్నవాళ్ళు జీతాలు తీసుకోకుండా ఉంటే బాగుంటుందని చెపుతున్నాను. ఇప్పుడు labour schools మొదలైనవి స్థాపించారు. బోర్డు స్కూల్సును లేబరుస్కూల్సుతో కలిపివేస్తే బాగుంటుందని చెపుతున్నాను. మామూలు వేస్టులాండ్సు, గవర్నమెంట్‌పట్టా భూముల లెక్కలు సేకరిద్దామనుకుంటే నాకు దొరకలేదు. ఈ మామూలు వేస్టు క్రింద పన్ను వేస్తే బాగుంటుందని చెపుతున్నాను. ఇర్రిగేషన్ విషయంలో డబ్బొచ్చేమార్గం చెపుతున్నాను. చాలా చోట్ల నీళ్ళు వృథాగా waste lands కు పారుచున్నవి. ఇలా అనవసరంగా నీళ్లు పాడుచేసేకంటె

Sri S. Vemiah] [9th March 1954

కావలసిన గ్రామములకు ఆ నీరు సప్లయి చేయడం మంచిది. ఇలా నీరు పాడు చేసే వాళ్ళమీద తీవ్రమైన పన్ను వేస్తే బాగుంటుంది. 20 వందల పైనా పెట్టిలు చేసినారు. లైసెన్సు పర్మిట్లు అన్ని పనులకు ఇస్తే కొంత డబ్బు లభించడానికి వీలౌతుంది. Public Works Department లో జరిగే పనులన్నిటిని ప్రయివేట్ contractors కు ఇచ్చేకంటె ఆ పను లన్నికూడా ప్రభుత్వంవారే చేస్తే, కొంత ధనలాభం ఉంటుంది. నిరుద్యోగ సమస్య కొంతవరకు పరిష్కరించవచ్చుని చెప్పి నేను ఇంతటితో ముగి స్తున్నాను!

Sri G. RAMA RAO :— అధ్యక్షా, ఈ బడ్జెట్ చదివిన గనుక నాకు కనిపించిందేమంటే, ఇందులో పాత ప్రామిసెస్, ఇంకేవో ఇతర పిమ సూత్రాలుతప్ప ప్రజలయొక్క ఆర్థికస్థాయిని పెంచడానికి నాకేమీ కనిపించలేదు. 5, 6 ఏళ్ళనుంచి ప్రభుత్వం ఏ బడ్జెట్ తీసు కొస్తున్నదో అదే తప్ప వేరే కల్పించడంలేదు. పన్నులను ఎక్కువ చేయడం ద్వారా ప్రజలకు ఎక్కువ సౌకర్యాలు కల్పించవచ్చుననే విషయం చూస్తే పన్నులు ఎక్కువచేసి, సౌకర్యాలు ఎక్కువ చేస్తారేమో అంటె అదీలేదు. Income and expenditure కూడా ఎక్కువ కనిపిస్తోంది. సంవత్సరానికి ప్రభుత్వానికివచ్చే శిస్తులో చాలా భాగం వ్యవసాయదారుల దగ్గరనుంచే వస్తున్నది. ఈ వ్యవసాయ కూలీలు పనులులేక వాళ్ల కొనుగోలు శక్తికూడా తగ్గిపోయింది. చిన్న చిన్న ఉద్యోగస్తులు జీతాలుచాలక బాధపడుతున్నారు. మోటారు కార్మికులను ఇతర కార్మికులను చూస్తే వాళ్ల పరిస్థితికూడా అలాగే వుంది. ఈ స్థితి ఇలా వుండడానికి కారణం ఏమిటి ? ముఖ్యంగా వ్యవ సాయ కూలీలకు భూములు కల్పించడానికి పూనుకోకుండా, పైపై మెరుగులు పెట్టడంవల్ల ఏమీ లాభంలేదని చెపుతున్నాను. ప్రభుత్వం ఈ డబ్బంతా ప్రజలనుంచి తీసుకొన్నప్పటికి దాన్ని సక్రమంగా ప్రజలకు ఉపయోగిస్తున్నారనే నమ్మకం నాకేమీ లేదు. ప్రభుత్వం చేతులలో ఉన్నటువంటి బంజరులను ప్రజలకు ఇవ్వడానికి ఇంత ఆలస్యం ఎందుకు ? అడిగితే దాని లెక్కలు మాదగ్గర లేవని చెపుతున్నారు. ఇంతేకాకుండా చీఫ్ మినిస్టరుగార్ని non-gazetted officers ఎంతమంది వున్నారని లెక్కలు అడిగితే మాదగ్గర ఏమీలేదని చెప్పారు. Departments

లెక్కలు ఇస్తున్నారో లేదో మాకు తెలియడం లేదు. ఏ డిపార్టుమెంటులోను లెక్కలు సరిగాలేక కాకుల లెక్కల క్రింద వుంది. ఈనాడు వ్యవసాయకూలీ యొక్క జీవనవ్యయం చూస్తే సంవత్సరానికి 468 రూపాయలు, రాబడి 365 రూపాయలు కనిపిస్తున్నది. సంవత్సరానికి రు. 45, 105 రూపాయల చొప్పున అప్పుపడుతున్నారు.

మగవాడికి 100 రోజులు, స్త్రీకి 120 రోజులు పనిలేకుండా పోతుందని చెపుతున్నారు. వాళ్ళందరు ఆకు, అలము తిని జీవిస్తున్నారు. కాని ప్రభుత్వం పూర్తిగా నిర్లక్ష్యం వహిస్తోంది. వ్యవసాయ కూలీలలో చదువుకున్న వాళ్లు నూటికి 37 మంది మాత్రమే ఇక వాళ్లకు వైద్య సౌకర్యాలసంగతి వేరే చెప్పనవసరం లేదు. Securitry measures క్రింద పోలీసు administration of justice కు ప్రభుత్వం 3 కోట్లు, social services, education, public health క్రింద 5 కోట్లు ఖర్చు చేస్తోంది. security services తో ఎవళ్లని రక్షిస్తుందో తెలియదు. వ్యవసాయకూలీ తనకు కూలీరేటు హెచ్చించమని గట్టిగా అడిగినందుకు, కార్మికులు తమకు కొంచెం కరువుభత్యం ఎక్కువ చెయ్యమని అడిగినందుకు వాళ్లని జైళ్లకు పంపడానికితప్ప మరెందుకూ వాళ్ళ ఉపయోగించడం లేదు.

ఇక ఎడ్యుకేషన్ విషయంలో ఎంత శ్రద్ధ వహిస్తున్నారంటే, Teachers Federation లో పనిచేస్తున్న ఉపాధ్యాయుల సర్టిఫికేట్లు సస్పెండు, కాన్సిలు చెయ్యడం వాళ్లని డిస్మిస్ చెయ్యడం, ప్రైవేటు మానేజిమెంట్లు ఉపాధ్యాయుల జీతాలు మాటిమాటికి cuts చేస్తూ వాళ్లని ఏడిపిస్తున్నారు. ప్రభుత్వం సదరు స్కూళ్లను స్వాధీనం చేసుకొని నడిపించాలి.

Public health విషయం ఎలా వున్నదంటే వ్యవసాయ కూలీలు అక్టోబరు, నవంబరు నెలలలో ఉభయగోదావరి జిల్లాలలోవుండే కూలీలను కృష్ణాజిల్లాకు తీసుకుపోతూ వుంటారు. రైళ్లమీద ఎంత రద్దీ వున్నా పాపం Central Government రైళ్లు అరిగిపోతాయని కాబోలు ఒక్క పెట్టెకూడా అదనంగా వెయ్యరు. రాష్ట్ర ప్రభుత్వము కూడా వారికి కావలసిన సౌకర్యాలు చెయ్యక అనారోగ్యం పెరిగిపోయి కలరా, మసూచికాలకు గురవుతున్నారు.

Sri G. Rama Rao] [9th March 1954

Indian Constibution లో "The State shall promote with special care the educational and economic interests of the weaker sections of the people, and, in particular, of the scheduled castes and the scheduled tribes, and shall protect them from social injustice and all forms of exploitations." అని వుంది. దాని ప్రకారం హరిజనులను, షెడ్యూలు జాతులవారిని ఈ ప్రభుత్వం ఏవిధంగానూ కాపాడడం లేదని తెలుస్తోంది. గన్నవరం తాలూకా వుంగుటూరు అనే గ్రామంలో గ్రామమునసబు ఒక దొంగతనం సందర్భంలో అనుమానించి [illegible] హింసించాడు. దీనిని వెంటనే దర్యాప్తు చేయించాలి. కొమురవోలులో ఇద్దరు హరిజనులను భూస్వాములు చంపేశారు. అంతేగాకుండా, కోర్టులో సరియైన సాక్ష్యం లేకుండాచేసి అబద్ధపుసాక్ష్యం ఇప్పించి కేసు కొట్టించేశారు. వారికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పినవారిని కూడా హింసిస్తున్నారు. ప్రభుత్వం ఈ విషయంలో శ్రద్ధతీసుకుని న్యాయం కలుగజెయ్యాలి. కోర్టులలోకూడా న్యాయంజరగడం లేదు. అది చాలా costly affair గా వుంది. దెబ్బలుతిన్న ఒక బీదవాడు డాక్టరు దగ్గరకు పోయి సర్టిఫికేట్లు డబ్బులేకుండా సంపాదించలేడు. కానిస్టేబుల్ దగ్గర నుంచి, పెద్ద ఆఫీసరువరకు లంచాలు తీసుకొని తిరిగి వాళ్ళకే సాయిచేస్తున్నారు. ఇంతాచేసి కోర్టుకు పోతే కేసు భూస్వాములపక్షాన్నే అవుతుంది. ఈ కులాలు, గోత్రాలు పుట్టడానికి కారణం ఆర్థికప్రతిపత్తే కారణంగా కనిపిస్తోంది. కాబట్టి హరిజనులకు, పేదలకు ప్రభుత్వం ఆర్థికసహాయం చెయ్యాలి.

ప్రస్తుతంవున్న rules ప్రకారం వాడిగావున్న భూస్వామి కోరలు యింకా పదును చెయ్యడానికేగాని కృంగి కృశించిపోయే పేదవాళ్ళకేమీ సహాయం జరగడంలేదు. కోఆపరేటివ్ బ్యాంకుల్లో అప్పులు భూస్వామికే దొరుకుతాయిగాని పేదకూలీకి దొరకవు. బ్యాంకిలో తక్కువ వడ్డీకి అప్పుతీసుకుని, తిరిగి కూలీకి హెచ్చువడ్డీకి అప్పిచ్చి వాణ్ణి పీల్చి పిప్పిచేస్తున్నాడు భూస్వామి. కాని ప్రభుత్వం యివన్నీ చూస్తూ వూరుకుంటోంది. ఎక్కడైనా పోరంబోకు భూమి, ఒక పేదవాడు సాగుచేసుకుంటే వాణ్ణి అందులోంచి తరిమెయ్యడంగాని, విపరీతముగా పెనాల్టీలు వెయ్యడముగాని చేసి హింసిస్తోంది. వాళ్ళకు Poverty certificate

9th March 1954] [Sri G. Rama Rao

కావలిస్తే ఒక వారంరోజులు కరణము, ఒక వారంరోజులు రెవెన్యూ ఇన్‌స్పెక్టరు, ఇంకొకవారం తహసీల్దారు త్రిప్పి పంపుతారు. ప్రభుత్వం చేసే చర్యలు బీదవాళ్ళ ఆర్థికస్థితినింకా దుర్భరంచేస్తున్నాయి.

హరిజనులకు చాలా సహాయం చేస్తున్నామంటుంది ప్రభుత్వం. 1946 సం॥ నుంచి హరిజనులకు గృహస్థలాల నిమిత్తం సంవత్సరానికి 5 లక్షల చొప్పున కేటాయిస్తే యిప్పటికి సుమారు 36 లక్షలు కనిపిస్తోంది. ఇందులో వాళ్ళ యిళ్ళనిమిత్తం యింతవరకు 11,54,000 మాత్రమే ఖర్చుచేశారు, మొత్తం కేటాయించిన 36 లక్షలలోను సుమారు 14 లక్షలు surrender చేస్తే, హరిజనులకేమాత్రం సహాయం చేశారో ఆలోచించండి. కోఆపరేటివ్ పద్ధతిని యిళ్లు కట్టుకునేందుకు పెద్ద పెద్ద భూస్వాములకు, ధనవంతులకే ప్రభుత్వసహాయం లభిస్తోంది గాని పేదవాళ్ళకేమీ లాభం కలుగడంలేదు.

పేదవాళ్ళను ఒకప్రక్క ప్రభుత్వం ఆర్థికంగా మోసంచేస్తూ రెండవప్రక్క రాజకీయంగా exploit చేస్తున్నారు. గత పంచాయతీ బోర్డు యెన్నికలలో హరిజనులచేత, వ్యవసాయకూలీలచేత భూస్వాముల సమక్షంలో చేతులెత్తించి వోటు వేయించారు. తెల్లవారితే భూస్వామి క్రింద పనిచెయ్యవలసిన వ్యవసాయకూలి భూస్వామికివ్యతిరేకంగా వోటు చేస్తే వాడిగతి ఏమవుతుందో గ్రహించండి. ఆమరునాటినుంచీ భూస్వామి వల్ల అతడు నానాహింసలకు గురవుతాడు. ఈ విధంగా వ్యవసాయ కూలీలకు ఘోరఅపచారం చేసింది మన శంకరరెడ్డిగారే.

అయితే ఈవిధంగా శంకరరెడ్డి దీనిని మదరాష్ట్రంలో తీసుకవచ్చి పెట్టడం తోటే, మనరాష్ట్రంలో శంకరరెడ్డి జాకు మనదేశం అంతటా వ్యాపించింది. దానితో హింస పెరిగిపోయింది. హింసా యుతమైనటువంటి పద్ధతి వచ్చింది. వారికి ఓటు వేయక పోతే పొలాలకు రాకుండా చేయడం, పనిలోనికి రాకుండా చేయడం జరుగుతోంది. భూస్వాములు, పెద్ద రైతులు వారిని బాధపెట్టడం దిన దినమునకు ఎక్కువగు చున్నట్లు కనబడుతుంది అని నేను మనవి చేస్తున్నాను. హరిజనులు భూస్వాముల్లవద్ద చాలా హింసల పాలవుతున్నారు. ప్రభుత్వం వారు హరిజనుల అభివృద్ధికి, సంక్షేమానికి ఏమి తోడ్పడుతున్నారు? హరి

Sri G. Rama Rao] [ 9th March 1954

జనుల [illegible] ఆర్థిక పరిస్థితి దినదినం చాలా క్షీణస్థితికి వచ్చుచున్నది అందుచేత ప్రభుత్వంవారు వారియొక్క ఆర్థికస్థితిని బాగుచేయాలని నేను కోరుచున్నాను. Temple Entry Bill ను తీసుకు వచ్చారు. ఈ Bill ను ప్రవేశ పెట్టినంత మాత్రాన హరిజనులకు ఏమాత్రం ప్రయోజనం లేదు. దీనివల్ల వారి ఆర్థిక పరిస్థితి చక్కబడదు. అందువల్ల temple entry లాంటి Bill లు తీసుకురావడం వల్ల హరిజనులకు ఏమాత్రం లాభం లేదు. వారు temples లోకి ప్రవేశిస్తే వారికి వచ్చేలాభం ఏమిటి? ఈ temple entry బిల్లు ప్రవేశ పెట్టిన తరువాత చాలా విషయములు జరుగుతున్నవి. ఉదాహరణకు ఒకవిషయం మనవిచేస్తున్నాను. మాఊరుప్రక్కన ఒకచోట దేవుడి ఆలయంలోకి హరిజనులు ప్రవేశించారని, అప్పుడు దేముడు అపవిత్రుడై పోయాడని ఆగుడి పూజారి wife కి రాత్రి కలవచ్చిందట. అంతమాత్రాన ఆగుడిని వదిలేసి ఇంకొక చోటికి పోయారు. దానితో ఆగుడి నాశనమై పోయింది. ఒక కల వచ్చినంత మాత్రాన ఇలా జరిగింది. రేపు తిరుపతిలో దేవుడు కూడా హరిజనులు ప్రవేశించారు, ఆలయం అపవిత్రమై పోయిందని ఎవరికో కలలో కనిపించి చెప్పేసి ఎవరెస్ట్ శిఖరం మీదకు పోతాడు. అందువల్ల ఈ temple entry వల్ల వారికేమీలాభం లేదు. ఈ temple entry Bill మొదలైనవి అమలుజరుపుటవల్ల ఏమాత్రం ప్రయోజనం లేదు కనుక, వారి ఆర్థిక పరిస్థితి బాగుపరచడానికి ప్రయత్నించాలని కోరుతున్నాను. వారి ఆర్థికస్థితి వృద్ధిచేసే బిల్లులను అమలుపర్చి వారికి తోడ్పడితే బాగుంటుందని మనవిచేస్తున్నాను. ఇకబంజరు భూముల విషయంలో చూస్తే, ఆబంజరు భూములను సాగుచేసు కోవడానికి హరిజనులకు ఇస్తామన్నారు. తరువాత ఏగ్రామంలోనున్న బంజరుభూములను ఆగ్రామంలోనున్న హరిజనులు బాగుచేసి సాగు చేసుకుంటున్నారు. ఈవిధమైన ఉత్తర్వును ప్రభుత్వం 1949 లో అమలుజరిపింది. గ్రామములలోనున్న బంజరు భూములను బాగుచేసుకొని ఎక్కువగా ఆహారమును పండించడానికిగాను హరిజనుల కిస్తున్నాము అనిచెప్పి హరిజనులను ఆ బంజరుభూములను బాగుచేసుకొనమన్నారు. దానితో ప్రతి గ్రామంలోని హరిజనులు, ఆయా గ్రామాలలోనున్న బంజరు భూములను బాగుచేసుకొని, కష్టపడి వాటిని పంటలకు లాయకుగా చేసుకొన్న తరువాత పంటలు పండించుకోడానికి సిద్ధంగా ఉన్నప్పుడు చివరికి వారి వద్దనుంచి

భూములకు ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకోవడం జరిగింది. ఆ భూములను ఎందువలన అలా hand over చేసుకున్నారో వారికి తెలియదు. ఇదివరలో వారికి సాగుచేసుకొనే నిమిత్తం యిచ్చి ఆక్రమించి రద్దు చేసేశారు. ఈ బంజరు భూములను పెద్ద పెద్ద భూస్వాములకు పెద్ద పెద్ద రైతులకు nominal rent పైన యివ్వడం జరుగుతున్నది. మాఊరుకు దగ్గరలోవున్న కల్లిండి గ్రామంలో M. Satyanarayana అనే ఆయన కొంత భూమికి చాలాకాలం క్రిందట దరఖాస్తు పెట్టుకున్నాడు. ఆయన ఈమధ్యనే చచ్చిపోయాడు. చచ్చిపోయిన తరువాత ఆయనకి ఆ భూమి మంజూరైంది. ఆయన చచ్చిపోయిన తరువాత కూడా ఆయనకి భూమి మంజూరు చేశారు. అప్పుడు కొడుకు పేరున ఎవరో డబ్బు కట్టుకుంటే అతనికి ఆభూమిని మంజూరు చేశారు. కాని హరిజనులు ఇంతకుముందే Field Labour Co-operative Society కి దరఖాస్తులు పెట్టుకున్నా వారికి భూములు యివ్వలేదు. ఈ 500 ల ఎకరముల బంజరుభూములు చచ్చిపోయిన M. Satyanarayana అనే ఆయనకి మంజూరు చేయబడ్డాయి. మంజూరు చేసినప్పుడు ఏమైనా conditions ఉన్నాయా అంటే ఏమీలేవు, Unconditional గా ఆ 500 ల ఎకరాల భూమిని మంజూరు చేయడం దానికి పట్టా యివ్వడం జరిగింది. ఎంతో కష్టాలుపడుతున్న హరిజనులకు వ్యవసాయ కూలీలకు బంజరు భూములను ఇవ్వకుండా భూస్వాములకు, చచ్చిపోయిన వారికి మంజూరు చేస్తున్నారు. అందుచేత ఈవిషయమై ప్రభుత్వం ఆలోచించాలని నేను కోరుతున్నాను. ఇలా ఈ temple entry మొదలైన తూతూ మంత్రాలతో ఈ హరిజనుల యొక్క ఆర్థిక స్థితి సాంఘిక జీవనం పెంపొందదు. అందువల్ల ఈ బంజరు భూముల సమస్యను Land Reforms తెచ్చి దానిద్వారా పరిష్కరించి, వీరికి భూములను పంచిపెట్టి వారి ఆర్థికపరిస్థితిని, సాంఘిక జీవనాభివృద్ధికి తోడ్పడాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri R. B. V. SUDARSANA VARMA:— అధ్యక్షా! ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు ఈయొక్క ప్రప్రథమ బడ్జెట్ మొత్తం సంవత్సరానికి ప్రవేశపెట్టినటువంటి ఆర్థికమంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారిని అభినందిస్తున్నాను. ఈవేళ తాత్కాలిక ప్రతిపక్ష నాయకుడుగా పని

Sri R. B. V. Sudarsana Varma] [9th March 1954

నిన్న శ్రీ పిలమర్రి వెంకటేశ్వర్లుగారు ఇది colourless budget, రంగు రుచి లేని వంటి బడ్జెట్ అన్నారు. రంగులేనిది కాబట్టే వారు దీనికి వారు పూశారు. బాగా విమర్శించారు కాని దానిని విడవవలసిన తీరుగా చదివినట్లయితే దానికి ఏ విధమైన వంకలు, అడ్డులు పెట్టవలసిన అవసర లేదు. మొట్టమొదట అనేక సంవత్సరాలుగా నేటికికూడ పరిష్కారమునకై చాలా ఒత్తిడి వస్తున్నదో, ఆ బంజరుభూముల సమస్యను పరిష్కారము చేయాలని ఇప్పటికి ఒక expert ను నియమించి, ఈ జమీందారీ, బంజరు భూముల సంస్కరణకు తలపెట్టడం చాలా ముఖ్యమైన, ముదావహమైన విషయం. ఈ సమస్యను, ఎలాంటి criticism కు తావు ఇవ్వకుండా సమగ్రమైన, సానుకూలమైనటువంటి పరిష్కారానికి పూనుకొనవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇక చేనేత పారిశ్రామికుల విషయంలో, నిన్న మొన్న బ్రహ్మాండమైన సత్యాగ్రహం జరిగినదని, ఆ సందర్భంలో పెద్దపెద్ద. నాయకుల ఆర్టికల్స్, ఉపన్యాసాలు, పెద్దపెద్ద నాయకులు యిచ్చిన సందేశాలు అన్నీ పత్రికలలో చూసేఉంటారు. అవిఅన్నీ చూసినట్లయితే చేనేతవారి పరిస్థితి ఎలా ఉన్నదో బోధపడుతుంది. ఈ పరిశ్రమ మనదేశంలో చాలా ప్రాముఖ్యతవహించిన సంగతి మీకు అందరికీ తెలిసియేయున్నది. ఈ పరిశ్రమను East India Company వారు అంతమొందించాలని పట్టుబట్టారు. కాని విఫలమైంది. మున్నూరు ఏండ్లుగా దీనిని అంతమొందించాలన్నా, అంతమొందకుండా ఈ నాటికి చాలా ప్రాముఖ్యత వహించియున్నది. గంజికేంద్రములను స్థాపించడంతోనే ఈ సమస్య పూర్తి పరిష్కారం కాదు. ఈ సమస్య పూర్తిగా పరిష్కారం కావలసివుంటే, ఈ మిల్లులు, handlooms ఒకరి కొకరు పోటీ చేసుకోకుండా, చీరలు, ధోవతులు, మొదలైనవి చేనేతవారికి, కేటాయించాలి. అలాగ ఏర్పాటు చేసి చేనేతవారికి సౌకర్యములు కల్గించితే ఈ సమస్య శాశ్వతంగా పరిష్కారమవుతుంది. ఇక community project ల విషయంలో community development schemes, National development extension schemes ఆంధ్రరాష్ట్రానికి 22 బ్లాకులు యిచ్చారు. అందులో community development schemes చిత్తూరు జిల్లాలో వాయిల్పాడు, నగరి తిరుత్తనికి extension చేశారని విన్నాము. దానికి చిత్తూరువారు ప్రభుత్వానికి మనస్ఫూర్తిగా అభినందనలు సమర్పిస్తు

9th March 1954] [Sri R. B. V. Sudarsana Varma

న్నారు. ఇక వెంకటేశ్వర్లు చెప్పినటువంటి విషయం ఏమిటంటే క్రొత్త పన్నులు. ఈ పన్నులు, commercial taxes, ఎక్కువగా వేయాక తప్పదేమని, ఎంతవరకు పన్నులు పెంచాలో అంతవరకే పెంచుతామని హామీ యిచ్చారు. ఆర్థికమంత్రి, శ్రీ విశ్వనాథంగారు. ప్రస్తుతం పెంచా పన్నులు పెంచకుండా ఎంతవరకు అవసరమో అంతవరకే పెంచవలయును. లేనివారి పాలిట ప్రతిపక్షమువారు ఆక్షేపణ తెలుపుటకు అవకాశం ఇవ్వకుండా క్రమమైన పన్నులను విధించాలని నేను కోరుతున్నాను. ఇక ఎలెక్ట్రిసిటీ extension, విషయంలో ముఖ్యంగా, నేను మొన్న ప్రభుత్వ పక్షమునకు సంబంధించినవారితో మాట్లాడిన సందర్భంలో పెద్దపెద్ద ప్రణాళికలలో కాలువల స్కీములేకాదు, ఎలెక్ట్రిసిటీని అనేకచోట్లకు సరఫరా చేసేందుకు ముఖ్యంగా ప్రభుత్వం పూనుకుంటుందని మాటల సందర్భంలో అన్నారు. ఈ విద్యుచ్ఛక్తి సరఫరాస్కీమును త్వరగా ప్రారంభించవలయునని మనవిచేస్తున్నాను. Electricity irrigation పనులకు చాలా అవసరం కనుక, దీనిని వెంటనే సరఫరా చేయాలి. చిత్తూరు జిల్లాలోని వారికి ఈ electricity irrigation స్కీములు వెంటనే అమలుపరచాలని కోరుతున్నాను. ప్రస్తుతం కొన్ని తాలూకాలలో కొలది గ్రామాలకు మాత్రం సరఫరా అవుతోంది. ఇపుడు మిగతా చోట్లకుకూడా త్వరలో సరఫరా చేయాలని చెప్పి ప్రత్యేకంగా ప్రభుత్వాన్ని మరొక సారి కోరుతున్నాను. నాగిరెడ్డిగారి జిల్లాకూడా చేరితే నాకు ఏమీ ఆక్షేపణలేదు. Major irrigation schemes లో తుంగభద్ర high level channel మామండూరులోయ మార్గంగా తిరుపతి, పుత్తూరు, తిరుత్తని వెళ్ళవచ్చునని కొందరు ఇంజనీర్లు చెప్పినట్లు విన్నాము. అది ఏమైనా వున్నట్లయితే దీనినికూడా సమగ్రంగా పరిశీలించవలసిందిగా కోరుచున్నాను. Local development schemes లో Collectorsను ప్రణాళిక పంపవలసినదని దానికి స్థానికంగా అర్ధ grant అవసరమని గవర్నమెంటువారు సూచనచేసినారు. ఇది స్థానికంగా కొంత ఉత్సాహం కలిగించేందుకు పూనుకుంటే కొన్ని చోట్ల 6, 7 సంవత్సరాలుగా మెట్టప్రాంతాలుగావున్న కొన్ని తాలూకాలలో అటువంటి అర్థ grants అయినా లేకుండా తుదకు కాయకష్టంతో అయినా భక్తిచేయకుండా చాలావరకు grant వృథాఅవుతోంది. ఇటువంటివి లేకుండా ముఖ్యంగా చిత్తూరుజిల్లాలో కొన్ని ప్రాంతాలకు

Sri. R. B. V. Sudarsana Varma] [9th March 1954

Central Government grants ఇచ్చి కాదుకష్టం. అర్ధ grant [illegible] సహాయం చేయవలసిందిగా ప్రభుత్వాన్ని ప్రత్యేకంగా కోరుతున్నారు. ఇక ముఖ్యమైనది తిరుపతి యూనివర్సిటీ. మొన్న మొన్న రాజధాని హైకోర్టు రగడలలోనుంచి బైటకు వచ్చిన తరువాత తిరిగి మనం విశ్వవిద్యాలయం రగడలోకి దిగేట్లా తోస్తుంది. దేవునిపై కాన్ని వ్యాపారం చేస్తూ కొన్ని విద్యాసంస్థలను నెలకొల్పి బాలురకు చదువు చెప్పిస్తున్నారని మీకు అందరకు తెలుసును. దానిని ఒక యూనివర్సిటీగా మార్చి అక్కడ యూనివర్సిటీ కేంద్రం నెలకొల్పడం అంటే [illegible] ఇది ప్రాంతీయ దురభిమానాలకు దారితీస్తుందని చెప్పడం చాలా చిత్రమైన విషయం.

* Sri. T. NAGI REDDI:—మేము అన్నది యూనివర్సిటీ పెట్ట వద్దనిగాదు. అది Residential University గా వుండాలి అని మాత్రమే. దీన్ని మేము ముందు ప్రజలదృష్టికి తెచ్చాం.

Sri R. B. SUDARSANA VARMA :— ఇది technical objection. ముఖ్యంగా ఈ రోజు పత్రికల్లో మామిడిపూడి వెంకట రంగయ్యగారు ఇది ఆంధ్రులలో అనైక్యతకు దారితీస్తుంది అని ప్రచురించారు. వారే అనైక్యతకు ఇది కారణంకాదని గట్టిగా మీకు చెబుతున్నారు. ఒక చిన్న విషయం చెబుతాను. మద్రాసురాష్ట్రంలో మద్రాసు యూనివర్సిటీ అన్నామలై యూనివర్సిటీ రెండు యూనివర్సిటీలు వున్నాయి. అవి తమిళులలో అనైక్యతకు దారితీసినవా? బొంబాయి రాష్ట్రంలో బొంబాయి, పూనా యూనివర్సిటీలు వున్నాయి. ఉత్తర ప్రదేశ్‌లో ఆగ్రా, బెనారస్, అలిఘుర్, లక్నో యూనివర్సిటీలు అయిదు వున్నాయి. ఇవిఅన్నీ ప్రాంతీయ అభిమానాలకు దారితీస్తున్నాయా?

Sri T. NAGI REDDI:— అన్నామలై యూనివర్సిటీ, మీరు చెప్పిన యూనివర్సిటీలు అన్నీ Residential Univarsity లు.

Sri. R. B. SUDARSANAVARMA:—I know what you are aiming at. ఈవిశ్వవిద్యాలయాన్ని Residential Univer-

9th March 1954] [Sri R. B. V. Sudarsana Varma

sity గా చేయడానికి డబ్బు అంత బాహాటంగా లేదు. Affiliating and Resedential University గా చేస్తే funds permit [illegible] Residential University గా మార్చుకోవచ్చును. ఆర్థిక మంత్రి గారు university development అంశములో 7 వ పేజీలో ఇలా చెప్పారు.

"Universities are an essential requirement for our growth and culture and their place in the social economy cannot be under-estimated. The Government have, therefore, decided to raise special funds for both the Universities amounting to Rs. 50 lakhs (Rs. 20 lakhs for Andhra University and Rs. 30 lakhs for Sri Venkateswara University) in order to speed up the development of the Andhra University and build up the Sri Venkateswara University."

కాబట్టి ఈ University ని Affiliating University గా చేయడంవల్ల ఎలాంటి విఘాతాలు రావని, వెంకటేశ్వరస్వామికి ఏలాంటి ప్రాంతీయ దురభిమానాలు లేవని తెలియజేస్తూ అభివృద్ధి ప్రణాళికలను త్వరలో అనులుజరిపి సర్వతోముఖమైన అభివృద్ధిని మన రాష్ట్రానికి చేకూరుస్తారని విశ్వసిస్తూ విరమిస్తూన్నాను.

Sri N. SIVARAMA REDDI:- అధ్యక్షా, ఈ బడ్జెటు చూసిన తరువాత ఇది పాడినదే పాటగా యథాప్రకారంగా వున్నదికాని ఏమీ క్రొత్తదనం కనిపించడంలేదు. పోయిన session ఈ session మధ్యలో కొన్ని పరిణామాలు వచ్చాయి. ఈ ప్రభుత్వంయొక్క ప్రధాన విధానాలుచూస్తే, ముఖ్యంగా హైకోర్టు, రాజధాని స్థాపించడంలో వారు తెచ్చిన తీర్మానాలను నూతన విద్యా విధానాన్ని prohibition ను పట్టుదలతో అమలుపరచడం, జిల్లాబోర్డులను రద్దుచేయడం చూచిన తరువాత ఈ ప్రభుత్వం అనుసరించే విధానాలు పూర్తిగా ప్రజలకు వ్యతిరేకమైన విధానాలని చెప్పవలసియున్నది. తరువాత ఈ బడ్జెటులో ఈనాడు దేశాన్ని ఎదుర్కొంటున్న తీవ్రమైన నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి ఏమాత్రం ప్రయత్నం లేదు.

తరువాత రాయలసీమలోను, యితర జిల్లాలలోనుకూడా రైతాంగం వ్యవసాయ కూలీలు ఋణభారంతో నలిగిపోతున్నారు. ఋణవిముక్తి కల్పించడానికి అనేక సంవత్సరాలనుండి శాశ్వతపరిష్కారం కావాలని కోరుతూ వెంటనే మారటోరియం ప్రకటించాలని ప్రజానీకం ఆందోళన చేస్తూవుంటే మారటోరియం ప్రకటించడానికి ఏవిధమైనసూచనలు ప్రసక్తి గాని యీ బడ్జెటులో లేకపోవడం చాలా విచారకరమైన విషయం. ప్రభుత్వం పైపైన కొన్నిస్కీములు- సేవలు extension అనండి. కమ్యూనిటీ ప్రాజెక్టులనండి ఫిర్కాడెవలెప్‌మెంటు అనండి- కొన్ని పైపైన పనులు చేస్తారంటుందిగాని దేశాన్ని ఎదుర్కొన్నటువంటి వ్యవసాయ సమస్యల పరిష్కారమునకు యీ ప్రభుత్వం ఏమాత్రం పూనుకోవడం లేదని తెలిసిపోతుంది. వ్యవసాయ సంస్కరణల విషయంలో expertను వేస్తున్నాం అనిచెప్పి బడ్జెటులోవున్నది. పోయినసారి మంత్రి కోటిరెడ్డి గారు మాట్లాడుతూ, "సాధారణంగా మనదేశంలో ముఖ్యంగా రాయలసీమ జిల్లాలలో వెయ్యిరూపాయలు శిస్తుచెల్లించే ఆసామి ఒకరూలేరు. ఎవరిభూముల్ని పంచాలి" అని మంత్రిగారు అన్నారు. దీన్నిబట్టి అర్థం అయిపోతుంది. వారు పెట్టబోయే శాసనం యింతకుముందు యినాముల రద్దుచట్టం మాదిరిగా ఎవరికీ వుపయోగంలేకుండా పోతుంది. ఈ బడ్జెటు ప్రసంగంలో ఒక ముఖ్యమైనటువంటి ఆక్షేపణకరమైనటువంటి వాక్యం వున్నది. "సకాలంలో వర్షాలు కుంభవృష్టిగా పడ్డాయి. పంటలు బాగా పండినవి కనుక శిస్తురెమిషను యిచ్చుటకు ఈతిబాధలకు గురియైన వ్యవసాయదార్లకు సహాయార్థం హెచ్చు మొత్తములను వెచ్చించు అవసరం వుండదని ఆశిస్తున్నాను." రాయలసీమ జిల్లాలలో అతివృష్టి కురిసిందిగాని సకాలంలో కురియలేదు అనిమాత్రం చెప్పగలను. రైతాంగానికిగల యీ బాధల్ని ప్రభుత్వం తెలుసుకోకపోవడం చాలా శోచనీయం అని చెబుతున్నాను. ఈ సంవత్సరం వేరుశనగలాంటి వ్యాపారపంటలు తీసుకోడానికి విత్తనాలు కొనడానికి రైతాంగానికి శక్తి లేకపోయింది. పండిన తిండిగింజలు సంవత్సరానికిగూడా సరిపోవడంలేదు. దీన్ని గమనించకుండా, రైతాంగం పరిస్థితి బాగానేవున్నది వారికి ఎటువంటి సహాయం అవసరం వుండదని చెప్పడం చాలా శోచనీయం.

**The Hon. Sri T. VISWANADHAM**:—హెచ్చుగా అవసరం లేదు.

9th March 1954 ]

Sri N. SIVARAMA REDDI:— హెచ్చుగా అవసరం లేదన్నారు. ప్రభుత్వభాషలో మాటలగారడీలో ఆకర్షణంగా వుంటుంది. రాయలసీమలో పంటలు బాగా పండాయని ఏ రాయలసీమ శాసనసభ్యులైనా అనగలరా అని అడుగుతున్నాను. దీన్ని గమనించకుండా ప్రభుత్వం అనుసరించే విధానం ఏమిటి? హెచ్చు సహాయం అవసరంలేదని విశ్వనాథంగారు చెబుతున్నారు. రాయచోటి తాలూకా మొదలుకొని అన్ని తాలూకాలలోనూ, ప్రభుత్వఅప్పులు కఠినంగా రాబట్టుతున్నారు. వ్యవసాయ సంస్కరణల విషయం తీసుకుందాం. చాలాకాలంనుంచి భూమిని సాగుచేస్తున్న కౌలుదారున్ని భూములనుండి వెడలగొట్టకుండా భూస్వాములపై ఏ కట్టుదిట్టాలు చేయలేదు. పోతే ఇనాముల విషయం తీసుకుందాం. కోటిరెడ్డిగారు not taken over inams లో rent reduction apply చేయవచ్చు. కడప జిల్లాలో సుమారు 90 not taken over inams వున్నవి. Rent reduction apply చేయడానికికూడా వీలుకాకుండా వున్నది. ఎందుకంటే Rent Reduction Act ప్రకారం యినాందారు account furnish చేయాలి. కాని యినాందార్లు account furnish చేయరు. ఈ పరిస్థితులలో రెవిన్యూ అధికారులు కూడా Rent Reduction Act apply చేయలేని స్థితిలోవున్నారు. భూములనుంచి రైతులను వెళ్ళగొట్టడం జరుగుతుంది. దీనిగురించి తాత్కాలికంగా యేమి చర్య తీసుకున్నారని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. ఒక ప్రక్కన expert ను నియమిస్తున్నాము అంటారు. రెండోవైపున యినాంలను రద్దుచేస్తే నష్టపరిహారం ఎక్కువగా యివ్వకోవాలంటారు. ఈ విధంగావుంటే సమస్యా పరిష్కారం ఏ విధంగాను ఆశించలేరని అనుకుంటాను.

The Hon. Sri T. VISWANATHAM :—పరిష్కారం ఎల్లాగో అవుతుంది.

Sri N. SIVARAMA REDDI :—Prohibition గురించి Congress High Command నుంచి వుత్తరువులు వచ్చే వరకు వేచి వుంటాం అని సంజీవిరెడ్డిగారు అన్నారు. ఈ నాడు దేశం కాంగ్రెసు నాయకత్వం కోసం ఎదురు చూస్తుందా అని అడుగు తున్నాను. ఈ నాడు ప్రొహిబిషను విఫలమైందనిదాన్ని రద్దు చేయడంవల్ల వచ్చిన

మెట్ట ప్రాంతాలకు ఉపయోగించ వచ్చునని రామమూర్తి కమిటీ స్పష్టంగా ఘంటాపథంగా చెప్పినప్పటికీ ఆలస్యము చేస్తూ యింకా హైలెవల్ [illegible] కాలువ కోసం వేచివున్నామని చెప్పడం [illegible] ము. ప్రొహిబిషన్ రద్దుచేస్తే రెవిన్యూ డెఫిసిట్ చాలవరకు పూడి పోతుంది. ప్రొహిబిషన్ రద్దుచేసినట్లయితే 45-46 సం లో ప్రొహిబిషన్ లేని రోజులలో ఆంధ్రదేశంలో 4 కోట్ల 60 లక్షల ఆదాయం వస్తుందని [illegible] చెబుతున్నది. ప్రొహిబిషను రద్దుచేసినట్లయితే revenue deficit తీరుతుంది కొత్త పన్నులు వేయ నవసరం ఉండదు. మరి surplus budget అవుతుంది. ఇరిగేషను విషయం లో కే. సి. కెనాల్ ఆయకట్టుదారులకు తుంగభద్రా రిజర్వాయరు నుండి రెండోపంటకు నీరు అందీయవచ్చు. ఈవిషయం వెనుక సంజీవ రెడ్డిగారితో [illegible], పుల్లారెడ్డిగారు మనవి చేసినాము. కాని యింతవరకు ఏర్పాట్లు [illegible] కనబడటంలేదు. రాయలసీమలో పరిశ్రమలు చాల వెనుకబడియున్నాయి. కడప జిల్లాలో ముఖ్యంగా పులివెందల తాలూకాలో భారతదేశములోనే ప్రసిద్ధిగాంచిన పైరైట్సు గనులున్నాయి. ఇది 49 లో 20 వేల టన్నులు నుండి యీనాడు 5 వేల టన్నులకు పడిపోయింది. దీనిబట్టి రాయలసీమలోని గనులు ఏవిధంగా వున్నాయో గమనించ వచ్చు. నిరుద్యోగం వ్యాపిస్తోంది. ఈ గనుల పరిశ్రమ అభివృద్ధి కావాలంటే గోపాలరావుగారి రిపోర్టు ప్రకారం రంగులు లితోపోను పరిశ్రమలు స్థాపించాలి. పరిశ్రముల అభివృద్ధి పరచడానికిగాని మార్కెటోరియము యివ్వడానికి గాని వ్యవసాయ కూలీల పస్థితిని బాగుచేయడానికిగాని ఒక పథకం, ఒక కార్యక్రమం యీప్రభుత్వానికి లేనట్టు కనబడుతుంది కాబట్టి ఈ బడ్జెటును. ఏమాత్రం అంగీకరించలేమని మనవి చేస్తున్నాను.

Sri N. S. RAMACHANDRA RAO:— అధ్యక్షా, యీ budget లో ఏమీ క్రొత్తతనములేదు. కాని ఒక క్రొత్తతనము మాత్రము స్పష్టముగా కనబడుతుంది. సుబ్రహ్మణ్యంగారి budget కును విశ్వనాథంగారి బడ్జెటునకును తేడావుంది. సుబ్రహ్మణ్యంగారి బడ్జెటు బరువుగావుంది. విశ్వనాథంగారి బడ్జెటు తేలికగావుంది. వేరే ఏది క్రొత్తతనము కనబడడములేదు. ముఖ్యంగా నేను నొక్కి చెప్పదలచుకున్నది Agency

ప్రాంత అభివృద్ధిని గురించి కొండజాతులవారి శ్రేయస్సు కోసము కొంత డబ్బు కేటాయించినాము. Agency ప్రాంత శ్రేయస్సుకొరకు కేటాయించిన మొత్తము చాల స్వల్ప మొత్తము. మలయప్పన్ committee వారు స్థూలదృష్ట్యా సూచించినట్లయితే ఆయన 10 సంవత్సరములలో సాధించ దలచిన కార్యక్రమమును కొనసాగించదలచితే ఏటా రెట్టింపు మొత్తమును Agency వారి శ్రేయస్సుకొరకుగాను ఖర్చుపెట్టవలయును గదా. ఈనాడు Agency ఆటవికజాతులవారి సౌకర్యాలకోసము కొంత డబ్బు కేటాయించబడినది. ఆడబ్బులో ఒక్కదమ్మిడీకూడా వాళ్లకు అందడము లేదు. Agency లోని ముఠాదార్లు గవర్నమెంటు ఉద్యోగులు ముఖ్యంగా forest ఉద్యోగులకు వెట్టిచాకిరిని రద్దుచేయడానికి ఏలాంటి డబ్బు అక్కరలేదు. యీవేళ ముఠాదారులు జమీందార్లు వెట్టిచాకిరి చేయించు కుంటున్నారంటే అది చాలకాలము నుండి వస్తున్నది ఆవెట్టిచాకిరిని నిర్మూలించవలసిన గవర్నమెంటు ఉద్యోగులు ముఖ్యంగా forest department వారే వెట్టిచాకిరి చేయించుకోవడమనేది చాల అన్యాయము. దీనిని గవర్నమెంటు వెంటనే అరికట్టవలెను. వారికి రోజుకు యే 4 లేక 5 అణాలువస్తు ఆ డబ్బును కంట్రాక్టర్లు ముఠాల పెద్ద చేతులలో పెట్టితే అది వారికి ముట్టడమేలేదు. మలయప్పన్ కమిటీవారు స్పష్టంగా యీ వెట్టిచాకిరిని వెంటనే రద్దుచేయడానికి ప్రభుత్వము తగు చర్యలు తీసుకోవాలని చెప్పినారు. ఐతే ఇంతవరకు ఏమి చర్యతీసుకొన లేదు. బేల్ చెట్టి అనే గ్రామములో వెట్టిచాకిరిచేయలేదని ఆగ్రామ మునసబు అక్కడ వారిని విపరీతంగా ఒత్తిడిచేసి బాధలుపెట్టుతున్నారు. వీరికి మద్దతుగా చింతూరు Police S. I., అంకినాడు Forest Officer అక్కడ వున్న ప్రజలు వెట్టిచాకిరి చేయడానికి నిరాకరించినందువల్ల వాళ్లను హింసించడము జరుగుతుంది. యీ విషయములో మంత్రి విశ్వనాథంగారి దగ్గరకు అక్కడ రైతుసంఘమువారు రావడము పెటిషన్లు యివ్వడము జరిగింది. ఐనప్పటికి వాండ్లపైన చర్యతీసికోలేదు. యీలాంటి ఉదాహరణాలు చెప్పాలంటే పోలవరము నుండి పార్వతీ పురంవరకు లెక్కలేనన్ని చెప్పవచ్చు. Agency కొండజాతులవారు యీ బాధలకు గురిఅవుతున్నారు. వెంటనే ప్రభుత్వము యీ వెట్టిచాకిరీ రద్దుచేయడానికి పూనుకోవాలి. మలయప్పన్ కమిటీ 5 కోట్ల రూపాయలు సిఫారస్సు చేసింది. యీడబ్బు P.W.D. వాండ్ల అంచనాలప్రకారంవేశిన మొత్తము.

ఉక్కడవున్న రైతులు యిచ్చేడబ్బుతో ఈ scheme పూర్తి చేయవచ్చు గనుక investigation చేయుమని చెప్తే డబ్బు వున్నవారికి బాగుమాస్తే డబ్బులేని వాండ్ల స్థితిగతులు ఎవరు విచారించాలని చెప్పి వెళ్లిపోయినారు. వెంటనే దీని విషయంలో తగిన నిర్ణయం తీసుకోవాలని మనవిచేస్తున్నాను.

Sri P. GUNNAYYA :— అధ్యక్షా, యీ budget ను present చేసిన విశ్వనాథంగారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు అర్పిస్తున్నాను. కాని శ్రీకాకుళం జిల్లాలోని చీపురుపల్లి చాలా వెనుకబడి వున్నదని వారికి తెలుసు. చీపురుపల్లి తాలూకా వెనుకబడిన తాలూకా అని Finance Minister గారికి, ప్రకాశం పంతులుగారికి కూడ తెలుసు. అలాంటప్పుడు చీపురుపల్లెకు ఉపయోగములేని స్థలంలో నారాయణపురం దగ్గర scheme వస్తుందని చాల విచారిస్తున్నాను. బొబ్బిలి తాలూకా వేగావతి నదికి వారాదివద్ద ఆనకట్ట కట్టించినచో 40 గ్రామాలకు ఉపయోగపడి కొన్ని వేల ఎకరాలలో అన్ని పంటలు పండును. చీపురుపల్లి తాలూకాలో నందివాడదగ్గర కట్టడానికి ప్లానువున్నారని తెలుసు. కాని నారాయణపురం దగ్గర కట్టడానికి నిశ్చయమైంది. దీనివల్ల ఏ 10-15 గ్రామాలకు ఉపయోగము వుంది. నందివాడదగ్గర కట్టిన కనీసము వందగ్రామాలకు ఉపయోగకరంగా వుంటుంది. కనుక విశ్వనాథం గారిని, ప్రకాశంగారిని నందివాడదగ్గర కట్టనుని ప్రార్థిస్తున్నాను. అదిగాక చీపురుపల్లి తాలూకాలో చిన్నచిన్న నీటివాగులు ఉన్నాయి. ఈవాగుల నీరు చెరువులోకి వచ్చేటట్లుగా ఏర్పాటుచేయుమని, మద్రాసు ప్రభుత్వము నుండి, అనేక దరఖాస్తులు ప్రభుత్వానికి పంపుతూవస్తున్నాము. పాతబడ్డ ఆనే మధుపానమును 5 లేక 6 వేల రూపాయలు ఖర్చుపెట్టి మరమ్మత్తు చేస్తే, ఆ ప్రాంతపు చెరువులనుండి కనీసము మూడు వేల యకరాల భూమి తడిచి రెండుపంటలు పండటానికి అవకాశం వున్నది. వెంటనే ప్రభుత్వంవారు యీ విషయములో ప్లానుకొని పనిచేయించి, ఆ ప్రాంతపు రైతులకు యిబ్బందులు తొలగించాలని, ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ముశిడివలస వూరచెరువు మొదలుకొని శిగడాం ఫ్యాక్టరీవాగుకు 10 వేలు ఖర్చుపెట్టి బండ్ త్రవిస్తే, జగన్నాథపురం, కొత్తపేట, శిగడాము, విద్దామ్ము మొదలగు 6 గ్రామముల చెర్వులకు సదరుబండ్ నీరువెళ్ళి

Sri P. S. Ramachandra Rao] [9th March 1954

సుమారు నాలుగైదువేల యకరాలభూమిలో రెండుపంటలు పండటానికి అవకాశం వుంది. ఇప్పుడా భూములు ఎక్కువపంటలు పండేటట్లుగా, నాగావళి [illegible] మరమ్మత్తుచేయించాలి- ఆ ప్రాంతపు రైతుల కష్టాలకు [illegible] మరమ్మత్తుచేయిస్తే ఆగండి ద్వారా కనీసం కొన్నివేల యకరాలభూమి సాగుఅవుతుంది. యీగండిని [illegible] మూడు సంవత్సరాలనుండి, ప్రభుత్వంవారి దగ్గర pending లో వున్నది. ఆ పనినికూడ త్వరలో పూర్తిచేయించి ఆ ప్రాంత ప్రజల యిబ్బందులను తొలగించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. నా కాన్స్టిట్యూయన్సీలో 320 గ్రామాలు వున్నాయి. ఆ గ్రామాలలో ఏ ప్రాంతమునకు చూచినా, ఒక road లేదు. ప్రజలు అనేక సార్లు ప్రభుత్వమునకు, అక్కడి జిల్లాకలెక్టరుకు, జిల్లాబోర్డు ప్రెసిడెంట్లకు దరఖాస్తులు పెట్టుకున్నారు. బల్లిపేటనుండి సుందరవాడ వుర్దవాలు మీదుగా రాజాంపోయే రోడ్డును నిర్మిస్తే అక్కడివారికి చాలా ప్రయోజనముగా వుంటుంది. ఎందుకంటే, బలిజపేటలో సంత అక్కడ బాగా జరుగుతుంది. ఒక లక్షరూపాయలవరకు ఆసంత జరుగుతూ వుంటుంది. చుట్టుపట్లనుండి అనేకమంది రైతులు, కూలీలు ఈసంతకు వస్తూవుంటారు. సరియైనత్రోవ లేకపోవుటచేత ప్రజలు చాలా కష్టపడుచున్నారు. అక్కడ రోడ్డువేసేటట్లయితే-ఆ ప్రాంతపు ప్రజలు తగిన సహాయం చేయటానికికూడ సిద్ధముగావున్నారు ఆలాంటి రోడ్డుసౌకర్యం ఆ ప్రాంతపు ప్రజలకు ప్రభుత్వం చేయవలెనని మనవిచేస్తున్నాను. ఇప్పుడు శిగడాంనుంచి, చీపురుపల్లి పోయేరోడ్డు ఒకటి, శిగడాంనుండి సర్వేశ్వరం మీదుగా ఒకరోడ్డు వేయిస్తే చాలా సౌకర్యంగా వుంటుంది. శిగడాంలో చాలామంది వ్యాపారస్తులు వున్నారు. అక్కడ రోడ్డువేయిస్తే- అచ్చట వ్యాపారస్తులు ఇతరచోట్లకు వెళ్ళి రావటానికే ఆప్రాంతపు ప్రజలకు చాలావీలుగా వుంటుంది. ఆరోడ్డునుగూడా ప్రభుత్వమువారు వెంటనే పూర్తిచేయించి అచ్చట ప్రజలకు తగిన సౌకర్యాలు చేయించాలని, మనవి చేస్తున్నాను.

నాగవళి ఏరు పొంగి పార్వతీపురం తాలూకాలో చోళపదంగ్రామములో 300 ఎకరములు గిజబ మొదలగు గ్రామములలో 200 ఎకరములు మేటలు వేసి పోయినవి. అవితీయించే విషయంలో ప్రభుత్వమువారు

[9th March 1954] [Sri P. S. Ramachandra Rao

అనేక నారులు చెప్పుకున్నాము. రైతులు ఇంత వరకూ, మొరపెట్టు కూనేవున్నారు. వారికి తగిన సౌకర్యాలు చేయలేదు. కాబట్టి వారు కోరిన సౌకర్యాలు చేయాలని, ప్రభుత్వం వారికి మనవి చేస్తున్నాను. బంజరు భూములను పేదవారికి యిస్తామని చెప్పుతున్నారు. కాని, శ్రీ ప్రకాశంపంతులుగారు హరిజనుల విషయములో ఎక్కువ నుండియో, ఉపకారం చేస్తామని, చెప్పుతున్నారు. ఆవిధంగా ఇప్పుడు పంటఫలించె రోజులు వచ్చాయి. కాబట్టి ప్రభుత్వమువారు హరిజనుల విషయములో 100 కి 70 వంతులైనా భూములను యిచ్చి మిగతా భూములను కూలీలకు యివ్వాలని, నేను కోరుతున్నాను. హరిజనులకు ఇండ్లు కట్టుకొనేందుకు, నివేశన స్థలాలు యివ్వటము లేదు వారు ఇండ్లు కట్టుకునేటందుకు తగిన అవకాశాలు కలిపిస్తారని నమ్ముతున్నాను.

ఇండ్ల స్థలాల కోసము బొబ్బిలి తాలూకా పెదపెంకి గ్రామము లోని కొందరు హరిజనులు దరఖాస్తులు పెట్టారు. 1200 రూపాయలు deposit కూడ కట్టారు. వారికి యింతవరకు, స్థలాలు యివ్వలేదు. అక్కడ ప్రభుత్వ అధికారులకు చెప్పుచునే యున్నాము. వారియిబ్బం దులను తొలగించవలసినదిగా ప్రభుత్వంవారికి మనవిచేస్తున్నాను.

అదేవిధంగా ధర్తిరాజేరు హరిజనులు ఇండ్ల నివేశస్థలములకు 600 రూపాయలు డిపాజిట్ చేసియున్నారు. వారికిగూడా స్థలముత్వరలో యిప్పిస్తారని ఆశిస్తున్నాను. పినపెంకినుంచి రాజేరు నందిగ్రామ మీదుగా తెర్లాముకు, ఒకరోడ్డు వేయించి అచ్చటి ప్రజల కష్టములను తొలగించ వేడుచున్నాను.

The House adjourned to meet again at 11 A.M. on Wednesday the 10th March 1954.

---